యనమః

# నామదేవు కల్యాణము.

ఐదంకముల నాటకము.

270

గ్రంథకర్త:
బాలకవి శిరోమణి,
శ్రీ. వి. వేంకటాచార్యులు.
నివాసము:- కందికట్కూరు.

5-30

చందా నారాయణ శ్రేష్ఠిగారి,
శ్రీ బాలా త్రిపురసుందరీ ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె, సికింద్రాబాద్.

1943

శ్రీమతే గీతాచార్యాయనమః

# నామదేవ కల్యాణము

(ఐదంకముల నాటకము.)

గ్రంథకర్త:


బాలకవి శిరోమణి శ్రీ. వి. వేంకటాచార్యులు.

నివాసమ్:- కందికట్కూరు





శ్రీ చందా నారాయణ శ్రేష్ఠిగారి

బాల త్రిపురసుందరీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

జనరల్ బజారు, సికింద్రాబాదు.

1943




వెల **1-8-0**

# పీఠిక.

మహాశయులగు భారతీయ సోదరులారా!

నే నిదివరకు సౌదామిని, అహల్యా శాపవిమోచనము, అభినవ భగినీసుతా శుల్కము, విశ్వామిత్ర తపోభంగము, భగవన్నుతి. శ్రీమద్రామాయణము, హరికథలు మున్నగునవి రచించితిని కాని ధనవిహీనుండ నగుటచేతను, భాగ్యవంతుల సహాయము లేకుండుటచేతను వాటిని ముద్రించుటకు శక్తిలేనివాడనై కవిత వ్రాసినందులకు ఫలము ముద్రించి ప్రచార మొనర్చనిది వృథా యని తలంచి కవిత వ్రాయుటకు సాహసింపక పురాణ హరికథోపన్యాసము లచ్చటచ్చట నొనర్చుచు పొట్టబోసుకొనుచుండ శ్రీ చిత్రభాను నామసంవత్సర వైశాఖమాసమున నవీన పరిచితులగు శ్రీయుత రా॥ సాగి రాఘవరావు ముల్కల్ల నివాసులు. నాచే కొన్నిదినంబులు జైమినీభారత పురాణంబు విని అటు పిమ్మట నేదైన భక్తిరస ప్రధానమగు నాటకము రచించి నా కంకితమిడుడని కర్పూర తాంబూల మొసంగ నేనీ నామదేవు కల్యాణము ప్రారంభించి కొన్ని మాసములవరకు సమాప్తము జేసితిని. ఇందలి కీర్తనలు శ్రీమాన్ ధప్పూరి సత్యనారాయణగారిచే రాగ తాళ లోపంబులు లేకుండునటుల నొనర్చినందులకు వారి యడుగుదమ్ములకు ప్రణతు లాచరించుచున్నాడను. దీనియం దేదైన దోషముండిన కృపాకరణీయత్త చిత్తులై సవరణ గావించి కృతార్థుని చేయగలరని విజ్ఞాపన.

ఇట్లు,

గ్రంథకర్త.

## ఈ నాటకమునందు వచ్చు పాత్రలు.

దామాజి
విశ్వనాథుడు
నారదుడు
పాండురంగస్వామి
రామనాథుడు
దివాన్
నామదేవు
భాగ్యశెట్టి
హనుమాన్
గరుత్మంతుడు
విష్ణుమూర్తి

స్త్రీలు.

గుణాబాయి
రాధాబాయి
భూదేవి
లక్ష్మి
రుక్మాబాయి
కమల

# పండితాభిప్రాయములు.



ఈ దృశ్య ప్రబంధము సాంగముగా తిలకించితిని. ఇందలి పాత్రౌచిత్యము శబ్దసౌష్టవము రసపోషణము కడుంగడు రమణీయము. ఇందలి భావములు నవీనములు. అనుబంధములు సంగీత శాస్త్రాను సరణీయమైనవి. ఈకవి బాలుడైనను బుద్ధి వైశాల్యమైనది. ఇతని కవితాశక్తి దినదినాభివృద్ధి యగునట్లు శ్రీకృష్ణభగవానుడు ప్రసాదించుగాత!

ఇట్లు,

విద్వాన్ దప్పూరి సత్యనారాయణాచార్యులు.

ఈ నాటక రాజమును సాంగోపాంగముగా దిలకించితిని. యీ కవివయస్సు చిన్నదైనను మేధావిశక్తి కడుంగడు శ్లాఘాపాత్రము. ఇందలి పద్యములు అతిరమణీయమై శబ్దసౌష్ఠ రసపోషణ సమన్వితమై యొప్పారుచుండెను. దీనిని కృతిసందిన శ్రీయుత సాగి రాఘవరావుగారి సుకృతవిశేష మనుపమానము. భక్తిరస ప్రధానమగు యీ దృశ్యప్రబంధము ప్రపంచమున అత్యంత విమలయశంబు గాంచుగాత!

ఇట్లు,

రాజేశ్రీ కేశవరాయుడు.

ఈ కవిచే విరచితమైన యీ గ్రంథమును సాంగముగా తిలకించితిని. ఇందలి పద్యంబులు పూర్వ కవిజన ప్రోక్తమునకు తుల్యములైఅలంకారోపేతములై పండితపామర రంజికములై లక్షణోపేతములై భక్తిప్రధానములై గనుపట్టుచు యీ మహామహుడైన ఈ కవియొక్క భక్తిరసము చెప్పకయే చూపించుచున్నయది. శ్లో॥ త-త్ప్రసాదం కరిష్యామి-యస్సురైరపి దుర్లభం- అన్నవి భగవత్కటాక్షము యీ మహాత్మునియందు సంపూర్ణముగా గల్గుగాక! యని ప్రార్థించుచున్నాను.

ఇట్లు బుధజన విధేయుడు.

రాధాకిషన్ రావు.



ఓం

శ్రీమతే గీతాచార్య పరబ్రహ్మణేనమః

# నామదేవు కల్యాణము.



## నాంది

శా॥ శ్రీరంజిల్లగ నిత్యసూరివరులున్ సేవింప శ్రీ భార్గవీ
నారీపాదము లొత్తుచుండ పరమామ్నాయంబులున్ స్తోత్రమిం
పారన్ సేయ భుజంగతల్పమున భాస్వద్భావనుల్ దాల్చి శృం
గారాకారత యోగనిద్రగొను రంగస్వామి బ్రోచున్ మమున్

(నాంద్యంతరమున సూత్రధారి ప్రవేశము.)

చం॥ అనుపమ జానకీశుని పదాబ్జములన్ మదిలోన నిల్పి పా
వనము శుభాస్పదంబు భవబంధ లతాలవిత్రమైన త
ద్ఘనతర మంత్రరాజమును గాఢముగా జపియించు వాయునం
దనుడిడు సాగి రాఘవవదాన్యున కంచితసర్వసౌఖ్యముల్.

కల్యాణరాగము—ఆదితాళము.

జయ మురహార భవభయహార నీపద సరసిజములు మది నిరతము నమ్మితి ॥జయ॥
నయగుణ కారుణ్యాబ్ధి వ్రజవధూనయన చకోరసుధాకర పాహి
పారవార గంభీర భక్తహృద్వారిజాత్మ లోకబాంధవామర। వారవయిరి
భంజన మధురిపు శృం। గార చరితముల్కల్లకపినుతా ॥జ॥

సర్వకళా పారీణులగు సదస్యులు తండోపతండంబులుగా దయచేసి నాటక ప్రదర్శన మెప్పుడెప్పుడో యని నిరీక్షించుచున్నవారలు. యిపుడే మత్సఖీలలామయగు నటిని రావించి యేనాటకప్రదర్శన మొనర్చవలయునో విచారించెద. (తెరవంకగాంచి) ప్రేయసీ!

నటి — (ప్రవేశించి) నాధా! యేమిశెలవు.

సూ— అటు వీక్షించుము. సభాసదులెల్లరు విచ్చేసి సభ నలంకరించి మన నాటక ప్రదర్శనాయత్తచిత్తులై యున్నవారు. మనమీరేయి యేరూపకము ప్రదర్శించిన వీరు సంతసింతురో యూహింపుము.

నటి— ఆర్యా! పరమ భాగవత శిఖామణియగు నామదేవు కల్యాణము ప్రదర్శించిన యుచితమని తోచుచున్నది

సూ— అది నూతన నాటకమా?

నటి— ఔను.

సూ— దానిని కృతినందిన వారలెవరు?

నటి— క॥ శ్రీ విలసిత సకల కలా
భావితమై శౌర్య ధైర్య భాసురమై స
త్పావనమై యనితర సా
ధ్యావృతమై పద్మనాయకాన్వయ మొప్పెన్

అట్టి కులంబున

ఉ॥ సాగి కులాబ్ధిచంద్రుడు ప్రశాంతుడు దుస్తర గర్వవైరి రా
డ్భోగి కదంబతార్క్ష్యుడు విభూషిత శౌర్యధనుండు సర్వ శా
స్త్రాగమ వేదితుండు జితరాగ మదః కమలుండు కల్మష
త్యాగి పరోపకారుడు నయజ్ఞుడు వేంకటరాయుడొప్పెడిన్

సూ॥ తరువాత.

నటి॥ గీ॥ పెండ్లియాడెను వైభవోపేతుడగుచు
సరసగుణఖని శ్రీలక్ష్మివర సుశీల
నర్సమాంబను బంధుజనంబులెల్ల
హర్షమొందగ సుముహూర్తమందు భళిరె!

ఆ రాజపుంగవుండు సతిద్వయముచే సకల సుఖములందుచుండ వారలకు

మ॥ జనియించెన్ నొక నందనుండు సుగుణ స్వాంతుండు శౌర్యప్రభా
ఘను డుద్యత్కర కీర్తిశోభితుడు విద్యాశాలి సద్ధర్మ వ
ర్తన ధౌరేయుండు భూసుర ప్రకర సత్కార ప్రియుండాశ్రితా
వను డంబోధి గభీరు డంచితుడు గోపాల్‌రాయ భూపాలుడున్.

సూ॥ తరువాత?

నటి॥ సీ॥ పద్మనాయక వంశ పాథోధి నవరత్న
కలిత విభాశిత కౌస్తుభుండు
దీనజనానీక మానస భుజగ భు
గ్వాత ప్రావృట్కాల వార్ముకుండు
కల్మష గాఢాంధకార పరిభాగీష్మ
కాలమధ్యందిన కర్మసాక్షి
శాత్రవ కాసన సంతాన భయద వి
స్ఫార సంజ్వలిత వైశ్వానరుండు
గీ॥ మదన జితరూపవిభవ రమాన్వితుండు
శ్రీనివాస పదాబ్జ సంసేవనుండు
ధన్యచరితుండు బహుళవదాన్యవరుడు
రమ్యచరితుండు గోపాలరాయ నృపుడు.

ఆ మహనీయుడు

క॥ నిరవధిక చరిత గుణఖని । పరిఫుల్లకుశేశయాక్షిపతి సేవా త
త్పరలక్ష్మి నర్సమాంబను । పరిణయమున గొనియె బంధువర్గము మెచ్చన్.

ఆ రాజదంపతు లన్యోన్య ప్రముదిత మానసులై యొప్పార

చ॥ సుతు డుదయించె సంతతవిశుద్ధ చరిత్రుడు బాహుశౌర్య భా
సితుడు విదూర కల్మషుడు శిక్షిత దుర్భరగర్వ శాత్రవ
ప్రతతుడు దీనలోక పరిరక్షణశీలుడు ధర్మకార్య మో
దితుడు పవిత్ర మానసుడు ధీరుడు రాఘవరాయ నాముడున్.

ఆ సుగుణ ఖనియగు నా రాజశేఖరుని గుణము లసాధారణములు.

సీ॥ శాన్తమే విస్తార సౌఖ్యంబు చేకూర్చు ॥ గలదంచు మదిలోన దలచువాడు
సత్యమే వాక్సిద్ధి సఫలత్వమొనరించు । ననిమితభాషియై యడరువాడు
దానమే జయలక్ష్మి ధామమంచని శక్తి । కొలదిగ యొనరించి వెలయువాడు
కోపమే పరిపంధి రూపమంచని దాని । కడకు బోదోలియు గాలువాడు

గీ॥ సురల చందంబు విప్రుల జూచువాడు । పరవధూటుల మాతలంచరయువాడు
పరుల ద్రవ్యంబునకు వాంఛపడనివాడు । రాజమాన్యుండు రాఘవరాయనృపుడు ॥

యిట్లొప్పుచు యౌవనుడై

క॥ జననీ జనకులు బాంధవ । జనులెల్లరు మోదమంద సాధ్వీమణి స
జ్జనసుత రామాంబను పా । వనమతి వైవాహమాడి భాసురుడగుచున్ ॥

వర్తిల్లుచుండ గొలదికాలమునకే నా రామామణి దివి నలంకరించ

క॥ పిమ్మట బుచ్చక్కను బుధ । సమ్మతి బెండ్లాడి బహుళ సౌఖ్యపయోధిన్
గ్రుమ్మరుచుండ గడు హితయు । గమ్మదయించెన్ వినూత్న కాంతి శరీరున్ ॥

గీ॥ పరమ గుణఖని విజ్ఞాన భావశీల । క్షాంతియుత భర్తసేవ నాసక్తచిత్త
అధితి పూజావిలోల రామాంబ నెన్న । తరమె శేషాహికైన విధాతకైన ॥

క॥ అనుపమ భక్తిన్ ధవు పద । వనజయుగం బాత్మనిల్పి వర్తిల్లును పా
వనచరిత సుగుణవతి స । జ్జనసుత రత్నాంబనెన్న శక్యంబగునె ॥

సూత్ర॥ ఆపిమ్మట

నటి॥ ఆ రాఘవరాయ భూపాలుని ధర్మపత్నియగు బుచ్చమ్మ గతజీవురాలయ్యెను.

సూత్ర॥ కటకటా కాలము దురవగాహము. అతరువాత.

నటి॥ చ॥ సరస వచోవిలాస సుమ సాయక సన్నిభరూప వైభవో
ద్భరిత ప్రమోదమానస శుభప్రదవర్తనశీల దాన త
త్పరత యశోవిరాజిత విదారిత కల్మష మంగమాంబికన్
పరిణయమాడె బంధు బుధవర్గము కౌతుకమంది మెచ్చగన్

ఆ గుణవతీమతల్లితో నా రాఘవరాయ భూపాలకుండు సౌఖ్యమున నుండగ

శా॥ లావణ్యంబున సద్గుణంబున మహోల్లాసంబునన్ సత్కళా
ప్రావీణ్యంబున ధీవిశేషమున శుంభచ్ఛాంతి చిత్తంబునన్
శ్రీ వాణీ గిరిజా సమానులన పుత్రీరత్నముల్ ముప్వుర
న్భావప్రీతిచెలంగ గాంచె శుభలగ్నంబందు మెచ్చన్ జనుల్

సూత్ర॥ వారి నామములు వచింపుము.

నటి॥ మొదటివారు కౌసల్య వారి గుణములు చెప్పెద వినుడు.

ఉ॥ వీడదు స్వప్నమందున వివేకము ఖేలనకైన ధూర్తులన్
గూడదు కష్టమందయిన కూళలటంచని దీనకోటి బో
నాడదు. పాపకార్య పథమందు చరించదు కల్లలాడగా
బూడదు. భర్త సేవనమె సొంపని యెంచును నెల్లవేళలన్

సూత్ర॥ రెండవవారు.

నటి॥ లక్ష్మీకాంతమ్మ.

ఉ॥ మానిను లీడుగారు బుధమానిత సద్గుణ మార్గవర్తి వి
ద్యానిధి దానధర్మపర తత్పర భర్తపదారవింద సే
వానుగత స్వభావకలవాణి శుభప్రద భూమణాంగి చం
ద్రానన లక్ష్మికాంతయన ధాత్రి ప్రసిద్ధయశంబు గాంచెగా

సూత్ర॥ మూడవవారు.

నటి॥ ఉ॥ శీల దయాలవాల మదు జిత్పద పద్మ నివేశితాత్మ సా
ధ్వీలలితాంగి నిర్మల వివేక గుణాఢ్య దురంత కల్మషా
న్మూలిని జేశసేవిత సముద్భవకౌతుక పూర్ణచిత్త యాం
డాలు యనంగ నొప్పు ధుతశాంబిక శస్త యశస్సమేతయై ॥

సూత్ర॥ జాత్యాభిమానివయి యింతవరకు స్త్రీలనే వర్ణించితివికాని వారి పురుష సంతానముమాట చెప్పవయితివి.

నటి॥ చెప్పెద వినుము.

క॥ వీరలను తగినవరులకు । కూరిమిచే పెండ్లిచేసి సుతుకంబున వి
స్ఫార సుఖంబులతో నొ । ప్పారెన్ రాఘవనృపాలవర్యుండంతన్

చ॥ తనియులు లేక చింతబడి తమ్మునిపుత్రుని శ్రీనివాసరా
యుని బుధ బంధువర్గము జయోన్నతి యంచనిపల్క దత్తు చే
కొని శుభ లక్ష్మణాంగి సుమకోమలి రుక్మిణిపేర నొప్పు క
న్యను ముదమందియున్ పరిణయంబు నొనర్చె జనుల్ శబాసనన్

శ్రీని వాసరావు గుణగణము లేమనుదాన

సీ॥ కలనైన గాని నవ్వులకైన యిసుమంత । కోపంబెరుంగని గుణయుతుండు
శ్రితజనత్రాణ దీపిత కంకణము కేల । ధరియించి వర్తించు ధర్మపరుడు
అతిథి సత్కార భాసితమార్గ సంచార । పరుడయ్యు వెలయు సుస్థిర మతుండు
శరణన్న శాత్రవున్ సంరక్షణముజేయ । దలపోయు కారుణ్యకలితమూర్తి

గీ॥ ఆర్యజన విధేయు డంచిత చరితుండు । దానవీతి ఘనుడు మాననీయ
పరుడు సత్కీర్తి ధుర్యుండు నిరుపమాన । శాంతచిత్తుండు శ్రీనివాసావనీశు॥

నిజదార యుక్తుండై యొప్పార రాజ్యలక్ష్మియను నొక నందన యుదయించి దినదిన ప్రవర్ధమానయై యుండె.

సూత్ర॥ యీ నాటకము రచించినవారలెవరు?

నటి॥

మ॥ వర కౌండిన్య కులప్రసూతుఁడు శుభాపస్తంబ సూత్రుండు బం
ధుర చారిత్రుఁడు వైష్ణవోత్తముఁడు శాంతుండింగిత జ్ఞాన త
త్పరుఁ డుద్యత్కర మాననీయుఁడు సదోపన్యాస శీలుండు సు
స్థిర భావుండగు వెంకటార్యుఁడు రచించెన్ కౌతుక స్వాంతుడై ॥

సూత్ర॥ సఖీ! మన యాలస్యమునకు సభాసదు లాగ్రహాయత్త చిత్తులగుదురని డెందము తొందరించుచున్నది. మనమేగి పాత్రల ధరించి సామాజిక సందోహ స్వాంతములకు సంతసం బొనర్తము రమ్ము.

నటి॥ చిత్తము.

(యిరువురు నిష్క్రమింతురు.)



# నామదేవు కల్యాణము.

ప్రథమాంకము

(నారదుడు వీణాగానము చేయుచు ప్రవేశము.)

శ్రీరాగము — ఆదితాళము.

గోపబాల భవతాపహరణ తాపసాళి వినుతాంఘ్రి జలరుహ ॥గోప॥
ధీపయోధి కమలామనోహరదీప యదుకుల పరితాపమురంధర ॥గోప॥
దీనలోక సంత్రాణ శుభాకర దానవారి కరుణాసరిత్పతీ-మాననీయమునుల్కల్లి పురీ హను
మంతవరద వేదవేద్య శ్రీహరి ॥గోప॥

దేవా! శ్రీమద్రమారమణా! భక్తవత్సల కృపాశింధూ దీనబంధు పరోపకార పరు డవన్న నీవే సమర్థుడవు. యెట్లన:

సీ॥ గజరాజు మకరిచే కష్టమొందుచునుండ । మనిపితివీవె రమాకళత్ర
భర్త శాపంబున పాషాణమౌ యహల్యను బ్రోచితీవు కల్యాణభావ
జనకుండిడెడు బాధలను మాన్పి ప్రహ్లాదు । రక్షించినావు విభ్రాజదేవా
కంసనృసంశునిన్ హింసించి దేవకీ । వసుదేవునేలు శుంభత్ప్రతాప

గీ॥ అదియు నిదియునన నేల నో యబ్జనాభ । జగతి పుట్టించి రక్షించి సమయజేయు
వట్టివాడవు నీవ నాద్యంతరహిత । నిన్నుమించిన యుపకారి నెందుగాన ॥

చక్రపాణీ! నీచే కల్పితమగు సర్వచేతనాళికి పరోపకారమే సహజధర్మముగా విధించి వారి వారి శక్త్యానుసారముగా యెవర్పజేయుచు, వారిచే కానికార్యముల నీవే మనుజా కృతి ధరించి యొనర్చుచుందువు.

చ॥ మును బలిదాడికోడి సురముఖ్యులు భీతివహించి పారికాం
చన గిరిగహ్వరంబుల విషాదముచే వసియించియుండ వా
మనుడవి నైవిగోచనుకుమారు రసాతలమంపి వారల
నృతునుపు మహోపకారుడవు మాధవ నీ సరివారలేరిలన్ ॥

(విచారించి) అబ్బా! భవదీయ విచిత్ర చరిత్రలన్నియు విమర్శింప పరోపకారమే సూచించుచున్నయది. మొన్ననేగదా దేవకీవసుదేవుల గర్భమునం దావిర్భవించి యశోదాదేవి దివ్యమందిరమున ప్రవృద్ధ దేహుండవై ప్రపంచ వంచకులగు కంస శిశు పాల దంతవక్ర పౌండ్రక నరక సాళ్వాదుల వధించి పేరాశగల దుర్యోధనాదుల

హరించ నెంచి కౌంతేయాదుల కఖండ సామ్రాజ్యలక్ష్మిని సమకూర్ప నెంచి భారత యుద్ధ మనుదానిని కల్పించి రణార్ణవ కర్ణధారుండవై పార్థునకు సారధివై నాతనికి గీతోప దేశము గావించిన మహోధిసమేతుడవు.

కేదారగౌళ — ఆదితాళము.

దేవదేవ నీలీలాజాలము భావింపగ అద్భుతంబు వరదా ॥దే॥ అవరించి చండకేశవాదుల నాడింతువు కీల్బొమ్మలచందము తావకీన సంకల్పముచే రాజీవ భవాండస్తోముం బెల్లను। ఆవిర్భావము నీవికల్పనముచే నిలయంబును గల్గు మురారీ ॥దేవ॥ జపహోమంబులు స్నాన సంధ్యలును తపములు దాంతులు వ్రతములు దానము । లుపవాసంబులు సల్పిన యుష్మ త్కృపలేకను సిద్ధింపదు మోక్షము॥ చపలాత్ములు నీచదేవతల పూజలు హర్షంబున గావించి రమా । ధిప నీకృపకును దప్పువారు ముల్కాల్లకు కీ పవనాత్మజ వందిత ॥దేవ॥

(యిటునటు గాంచి) శ్రీమన్నారాయణ విచిత్ర కథాస్మరణ సుధారసపాన కుతూహల స్వాంతుడనై నా సంచారము నైతము మానినంతిలో భూలోకమునకు వచ్చితిని (విచారించి) ప్రస్తుతము యీ భూలోకమునగల్గు ప్రజలచేజరుగు కార్యము లెట్లున్నవో వీక్షించి వీరికి నాచే నేమైన యుపకృతి గావలసియున్న అక్కార్య మొనర్చి మహా ధన్యాత్ముడనయ్యెద. (ఇంచుక యూరకొని) అహా! ప్రపంచసేవ యొనర్చునంతటి భాగ్యము లభించక చావా కాలము గతించెను. (భూలోకమంతయు వీక్షించి) హా రా! యీ భూలోకవాసులచే యొనర్చు దుండగము లేమనువాడ

మ॥ కలిసంక్రాంతమె యెందునైన బుధసత్కారంబులుల్ మానె వే
శ్యల జెల్వాలును మించె మాంత్రికుల మోసం బద్భుతంబాయె స
త్కులజుల్ భిక్షుకులైరి నాస్తికుల వాక్పారత్వముల్ మించె ని
శ్చల విజ్ఞానము రూపుమాసె ధరణీ సంక్షోభముల్ జెందదుల్

అంతియేకాక

శా॥ పాపం బేమియొకాని మర్త్యులకు విద్వాంసుల్ ప్రశంసించు స
ల్లాపంబుల్ రుచియింపకుండె తరుణీ లౌల్యంబు హింసక్రియల్
కాపట్యంబు పరోపకారము తిరస్కార క్రియల్ ప్రవృద్ధ సం
తాపంబుల్ మది హెచ్చె భూవలయ మత్యంతంబుగా ఘూర్ణిలెన్

శ్లో॥ అత్యుత్కటైః పుణ్యపాపై యిహైవ ఫలమశ్నుతే) అనునట్లు వీరొనర్చు కుకా ర్యములచే వీరిస్థితి అతి హైన్యముగా నుండెను. అవి యేమని వర్ణించువాడ.

సీ॥ తిండికి గతిలేక దీనత్వమొందుచు । పరులకు సేవలు జరుపువారు
సూర్యచంద్రులరశ్మి సోకెడు గృహములన్ను । బడియుండి మలమూలి మిసకువారు
సంతానమున కతి సంతాపమొందుచు । భూతపూజలు సేయ బూనువారు
కట్ట బట్టయులేక కష్టమొందుచు పరుల । జీర్ణాంబరముల యాచించువారు

గీ॥ వావి వరుసలులేక వివాహమాడి । పిదప యెడబాటుచే దురపిల్లువారు
నీతి వనవాసమేగెను బూతుమించె । కాలగర్భంబునను నేమి గలుగునో కో॥

దయా శౌచ సత్యశీలంబులు పూర్తిగా గానరావయ్యెను. జారచోరాది కృత్యములు ప్రబలిపోయెను. హరినామస్మరణ మెగటుగ దోచెను. స్త్రీలవైపునకొక కన్నెంచి వీక్షింతమన్న వారికి పతిభక్తి అసహ్యమయ్యెను. మొగుడు మోటయ్యెను. ఓర్పు క్షీణించెను. పతిని గడ్డిపరకకన్న హీనముగా జూచి భయమనునది విడనాడి, స్వతంత్రజీవనులై స్వేచ్ఛావిహారులై లజ్జలను కాలదన్నిరి. అప్పుడే ఘోరకలి ఆవహిల్లినదా! (విచా) లేదులేదు యింక కొంతకాలము గానున్నది. పాపము! వీరలిట్టి యాపదనుండి విడుదల సేయవలయునని కుతూహల మొదవుచున్నది. (ఆలోచనానిమగ్నుడై) అహా! నాకొక చక్కనియూహ పొడగట్టినది.

సీ॥ అలవైకుంఠమునకేగి శ్రీహరి పదాబ్జ। ములకు ప్రణమిలి యీ ఘోరకలివశమువల్ల
దీర్పవే యని భక్తి ప్రార్థించ నతడు। నాదు కోరిక తీర్చు మోదమలరు॥

అసావేరిరాగము — ఆదితాళము.

సంకల్ప మెన్నతరమా। కరుణాలవాలుడైన వాసుదేవుని ॥సం॥ పంకజభవువంటివాని సతతము కింకరునిగ జేయుచుండు నారయ। కింకరుని భుజంగ సంఘరాట్కంకణునిగ జేయుచుండు భళిభళి॥ కనకశైలముగ కందుకంబుగతి దినకరునిగ ఖద్యోతముభాతిగ వినతాత్మజు నూరపిచ్చుకమువలె విలాసముగ జేయుచుండు భళిభళీ ॥సం॥ ఆనందము యొని అద్భుతచరితము ఆనందము బఖిలయోగులకు గానలేరు అజ్ఞానులు వర ముల్కల్లి పురీకపిరాజవరదుని ॥సం॥ (పోబోవును.)

(భూదేవి విషాదమున ప్రవేశము.)

శ్రీరాగము — రూపకతాళము.

ఘోరబాధ లెన్నినాళ్లు గడుపవలయునో ॥ఘో॥ క్రూరమతులు జనియించియు జారచోర హింసాదులు పారుబోతులైయొనర్చ పాలుబడిరి హా ॥ఘో॥ యేరీతి భరియింతును యేరి జేరి ప్రార్థింతును ధారుని ముల్కల్లిపురీతరుచర వరదా నసుగను ॥ఘో॥

నార॥ ఆ విలపించుచు వచ్చుచున్న కాంతారత్న మెవ్వరు. (నిదానించి అబ్బురపాటుతో) అతిభారముచే బాధనొందుచున్న రత్నగర్భని అత్యంత ధైర్యసంయుతయైన యీ ధరిత్రియు వికలత్వమొందినది. పాపము! యెట్టి ధైర్యసంపన్నులైనను అతికష్టము ననుభవించు కాలమున వికలత్వమొందక యేమిజేసెదరు. నేనామెను సమీపించి కొన్ని యుపలాలించెద. (సమీపమున కేగి) తల్లీ! విశ్వంభరా!

ఉ॥ కన్నులనుండి భాష్పములు గారగ కేశభరంబువీడి యత్యున్నత తూర్ణగామివయి తో డెవరైననులేక దుఃఖసం
పన్నతనొంది ఘోర వనవాటికలందు చరింతువేల వి
ద్వన్నుతమూర్తి శ్రీహరి కృపారసమొల్లగ నిన్నుగాంచడే

తల్లీ! నీ దుఃఖకారణమంతయు యేనెరింగిన నద్దాని బాపుటకై వైకుంఠమునకు రమాకళత్రుని నాశ్రయింప పయనమైతిని.

భూదేవి॥ బేహాగ్ రాగము—ఆది

వినుమయ్య నారదా । నాదుబాధలేమని వచింతు ॥విను॥ వనజాక్షుడు శౌరి యింత నిర్దయ గనుటచేత వచియింపరాని ఆ । వనటగల్గె నెదుబోదు నన్నేఘనుడు నుద్ధరించ గలడో ॥విను॥

నార॥ వంతమానుమమ్మ నీదుమదిలో । వంతెసుఖంబులు సమముగ జూచియు ॥వం॥ వింతయయ్యొ ధైర్యనిధి వటంచని పేరుగన్న నీవిటు చరియింపక శాంతమెల్లమాని తొందరొంది జయము లేదు సుఖముగలేదుగద॥

భూ॥ వినుమయ్య నారదా॥

నార॥ అమ్మా! అనారతము నదీనద పర్వత సమూహాతిర్యక్జంతువు లెన్నియో ధరించియున్న నీకీ భారము దుస్సాధ్యమా? కాలదికాల నోపికపట్టుము. నీ కష్టదినములు గడచి సుఖభర్మడోలికల దేలియాడగలవు.

భూ॥ అన్నియు దెలసిన ఆర్యులగు మీరే యీ భారము దుస్సాధ్యమా యన నేమనుదాన. ఇపుడు మోయుచున్న భారము వచింపతరముగాదు.

ఉ॥ దాన జపాది కార్యములు దాంతి దయాంతపశ్శీల శౌచము
న్మాని చరించు విప్రులు క్షమాది గుణంబులవీడి నట్టి భూ
జానులు లోభవర్తనము సల్పు కిరాతులు పంచయజ్ఞము
న్బావని పాదజుల్ ప్రబలిపోయిరి యేమనుదాన నారదా

అంతియేకాక

సీ॥ సనస కర్మము లెందు జరుగనికతన దు । ర్భిక్షమెల్లడల వ్యాపించిమించె
అతిబాల్య వైవాహరతులాటచేత వై । ధవ్యపిశాచ నృత్యంబుమించె
ధర్మమార్గావరోధనముచే శ్వానసం । తానంబురీతి మార్త్యాళిమించె
మతిహీనజనులు భూపతులౌటచేత హిం । సాశక్తి శౌర్యభాస్వరతమించె

గీ॥ జారచోరాది కృత్యముల్ పేరుగాంచె । వ్రజకుంతల మాటలే పాటియయ్యొ
ధనికులే గొప్పవారలై దనరుచుండ్రి । నారదా యెట్లుమోతు యీభార మెల్ల॥

మంగునకీనియు కర్మజ్ఞాన భక్తులు గానరారయ్యెను. స్వప్నమందైనను శ్రీహరికథాశ్రవణంబు వినరావయ్యె. వేదబాహ్య మతము లెన్నియో ప్రబలిపోయెను. ఇక స్త్రీలవర్తనము వర్ణింపరానిదై యుండెను. అయినను కొంత సంగ్రహముగా దెల్పెదను.

మ॥ పశుల స్కంధములచేత దాసులగలిజ వర్తింపగా జేసి వా
క్స్వతుచత్వంబున స్త్రీస్వతంత్రమునకై సంఘంబులన్గూర్చి ప్రో
ద్యత్సత్కారంబుల జేసి మూర్ఖమతి వేశ్యాళిల చందంబు యే
గతి చర్చించక సంచరించెదరు యుక్కాలంబునకే నారదా

ఇంకెన్నియో యీలాటి దుష్ప్రవర్తనములు గలవు. ఈ ఘోరభారము భరింపజాలకున్నదానను. (దుఃఖించును.)

నార॥ బేహాగ్ రాగము—ఆదితాళము.

శుభప్రదాయయిని మాయమ్మ । శోకమూరడిల్లు నీదుమదిగల ॥శు॥ విభవకలితయై యల

నీకు యీవిధముగల్గె కాలమహిమచేతను ॥కు॥ దురితలుద్భవించియును దుర్జనులగూల్చి నిన్ను బ్రోచుటెరుగవె ॥కు॥ నీదుభారమెల్ల మాన్పుటకును న్నెరింగి శ్రీవిఠలుండను నతో బోదునంచు సమకట్టియుంటిగా మల్కల్ల పౌరవరదుని సాక్షిగ ॥కు॥

నీవు నా వెను వెంటరమ్ము. శ్రీమన్నారాయణుని జేరబోయి సకలము నివేదించిన నీయాపద నాతడే నివారింపగలడు.

భూదేవి॥ చిత్తము.

నార॥ మాంజీ రాగము — ఆదితాళము.

నీ శుభమహిమలు నిర్ణయించగను నేరరికెవ్వరు శ్రీరమణా ॥నీశుభ॥ నాశరహిత భవదీయ ప్రకృతివారాశి దరింపగజాలరుమూఢులు ॥నీ॥ భాసురాంగసృష్టి స్థితిలయముల జేసుట నీకే కార్యంబో । దాసాననయోగి హృత్కమల భాసితకోమల చరణకిసలయా ॥నీ॥ నీరజభవబృందావకనుత పదనీరజ శ్రీకరగోవిందా । మేరుధీర మున్కల్ల నిల యూజా మారుతనుత పరిపాలముకుందా ॥నీశు॥

(ఇరువురు నిష్క్రమింతురు.)

---

## శ్రీ వై కుం ఠ న గ ర ము.

(లక్ష్మీదేవి ప్రవేశించి కూర్చొనియుండును.)

లక్ష్మీదేవి॥ రాజీవ ప్రభవాండభాండ నిర్మాణ ప్రవీణ దురంధరుండవగు శ్రీమన్నారాయణా!

కేదారజిల్లా — ఆదితాళము.

నీ మహిమాంబలియ వశమా ॥నీ॥ తామరసోద్భవ వామదేవులకు ॥నీమ॥
కామితార్థదాయక పరమేశా । కామకోటి సుందర జగదీశా ॥నీమ॥
మేరుధీర భవతారణ మురహర సూరివినుత సంశోభితసద్గుణ ॥నీమ॥
ఆగమాన్త సంచారణ కరుణా । సాగర శ్రితజనజాల సన్నుతా ॥నీ॥
వరమల్కల్ల నివాస సమీరణ । వరతనయార్చిత వాసుదేవహరి ॥నీమ॥

తాపసహృత్పుండరీక సమధ్యవేశా! నీ తొలిపలుకులే నీ సద్గుణాముల వినుతించి తుదకు వేసారి అనంతాయను జగత్ప్రఖ్యాత బిరుదము నీ కంటగట్టె నీగుణములు వర్ణింప నేనెంతదాన

ఉ॥ వేదము లెన్ని సేర్చిన వివిక్తమతిజ జపహోమ కర్మ దీ
క్షాదులైన సత్వగుణశాలి యటంచని పేరుగన్న బ్ర
హ్మాది సురాళిపూజల నిమగ్న మనస్కుడనైన నీ కృపా
రాదట యేమిచిత్రము విరాజిత కౌస్తుభహార కంధరా

నిరంతరము శ్రద్ధాభక్తి సంకలితులై భవన్నామాను సంధాన మొనర్చుచు నిన్ను శరణు బొందు భక్తుల రక్షించుటకై పడరానిపాట్లు బడుచుందువు. అబ్బా! భక్తులపైన నీకుగల అవ్యాజ కృపారసం బేమని పేర్కొనుదాన.

సీ॥ ఘనకల్మషానీక కలితు డజామిళు । పాలించునట్టి నీ పరమకరుణ
సీతాపరాధంబుజేయు కాకాసురుల్ । ప్రోచినయట్టి నీ పూర్ణకరుణ
పరమ భక్తులతోడ సరిజేసి శబరి యెం । గిలిదిని గాచునీ యలఘుకరుణ
శాత్రవానుజు విభీషణు మానసార్తిని । దీర్చిన యట్టి నీ దివ్యకరుణ

గీ॥ అల యహల్యను బ్రోచు నీ లలితకరుణ । పాండుకుమరుల నేలు నీభవ్యకరుణ
ద్రౌపదిని బ్రోచునట్టి నీ రమ్యకరుణ । వర్ణనము సేయదరమె యెవ్వారికైన
నీ కృపారసమున కంతులేదుగాన భక్తులెల్ల అత్యంత గంభీర కృపారసము ద్రావుదిరి.

(శ్రీమన్నారాయణుడు ప్రవేశము.)

మోహనరాగము—ఆదితాళము.

నా గుణముల నెన్నగలరా నా లీలలు కనగలరా । నా శౌర్యముకోర్చెదరా ॥నా॥
భాగవతోత్తమవరులు మునీంద్రులు నాగభూషణ విధాతసురులు నా ॥గుణ॥
పగతుండైనను పాదసేవకుని పగది చరించు నను గాంచగ ॥నాగుణ॥
శరముల్కాల్లపురీనివాసుడౌ తరుచరుడౌ వాతాత్మజుడైన ॥నాగుణ॥

నారాయణి! నేడేల దీర్ఘాలోచన తత్పరురాలవై యున్నదానవు.

లక్ష్మి॥ (నమస్కరించి) నాధా! భవదీయ కృపాగుణ విశేషములగూర్చి యాలోచించుచుంటిని.

శ్రీమ॥ దేవీ! పరోపకార బుద్ధిగల నీబోటి వైదుషీమణుల కెల్లప్పుడు పరగుణస్తుత పరాయణత్వముకాక వేరొండు కార్యముండునా.

సీ॥ పలుబాధ లొనరించబడుచు విశ్వంభరా ॥ సస్యాఢ్యయై ప్రోచు జంతుసమితి
అనిశంబు రవికైరవాప్తులు లోకసం । ఘముల శ్రద్ధాళులై గాచుచుంద్రు
పవలు రాత్రులులేక పవనుండు సర్వ చే ॥ తనులందు ప్రేమచే దనరుచుండు
జీమూతములు శింధుజేరి నీరముగ్రోలి । విరివిగా వర్షముల్ గురియుచుండు

గీ॥ అరయ నాచేత కల్పితమైన సర్వ ॥ లోకములు నెల్లను ప్రకృతిలేకయెపుడు
నుండనేరవు నాకు బ్రహ్మాండకోట్లు । కల్పనవికల్పన స్థితిగాదె వనియు
నిరంతరము నాకత్యంత ప్రేమపాత్రులగు భక్తుల సంరక్షణ యొనర్చుమని నాతో ప్రార్థనపూర్వకముగ జెప్పి, భక్తోద్ధరణబుద్ధి నాకుగల్గించు నీ పరోపకారము అత్యంత శ్లాఘాపాత్రముగాదా.

లక్ష్మి॥ నిరంతరము నా కత్యంత ప్రేమపాత్రులు. నాభక్తులని వాక్రుచ్చితిరి. అది మీ నిశ్చయ భావమైనయడల

మ॥ శివభక్తావళి ద్రవ్యసంపదల రాజిల్లల్ గతంబేమి లో
కవరీయత్వము గాంచు నిర్జర నదిల్ గన్నట్టి మీపాద సత్
స్తవమే జీవనమంచు నెంచు హరిదాసశ్రేష్ఠులున్ బిచ్చగాం
డ్రవనిన్ ద్రిమ్మరు టేమికారణము నాధా! సత్కృపన్ జెల్పుడీ

శ్రీమ॥ (సుఖాసీనుడై నవ్వి) పద్మాలయా!

గీ॥ యెవనిపై నా యనుగ్రహ మేగగలదో । వాని సర్వంబు హరించి పలుకరాని
కష్టములగూర్చి భక్తాగ్రగణ్యుజేసి । అనితరానందమైన సౌఖ్యంబుగూర్తు ॥

కాలుడు కోరసమొనర్చునిది తల్లికి నుపలాలించుబుద్ధి జనించనట్లు జీవుని ముప్పాతిప్పలు బెట్టునిది మోక్షమిచ్చు స్వభావము నాకుగల్గదు.

లక్ష్మి॥ భీమ్ ఫలాస్ రాగము — ఆదితాళము.

జలజభవనుతా । ఏలయిటుల జేసెదావు ॥జల॥ ఖలుల యిటులజేయవలయుగాని శాంత జనుల నిన్నెదలచునట్టి భక్తవరుల దండించగ న్యాయమా నె ॥జల॥

శ్రీమ॥ జెలి పెదరమణీ। పామరులిది తెలియలేరు ॥జెలి॥ ఖలులకిచ్చునట్టి సుఖము నిలుపదు చంచలమునిజము యిలను చెలయు ముల్కాల్ల నిలయుడాంజనేయు డెరుగు ॥జె॥

యింకొక రహసం మెరింగించెద.

సీ॥ పలుమారు తప్తమై బంగారు వెలలేని । కాంతివహించియు గాలుగాదె
సానబగ సూక్ష్మమై వజ్రమనితర ॥ భాస్వీత వస్తువై వరలుగాదె
రోకటిదెబ్బలుందాక వడ్లును బియ్య ॥ మై వంటకొప్పిదమౌనుగాదె
ఖండ ఖండంబిక్షు దండంబుగావింప ॥ మధురసంబిచ్చియు మసలుగాదె

గీ॥ అరయ కష్టీఫలీ యను వాక్యవచన ॥ మెరుగవే ప్రాణిగణమెల్ల దురితసమితి
వలన కష్టంబులొంది తత్వము నెరింగి । విపుల సౌఖ్యంబు గాంతురో వెలదిమిన్న॥

మున్నొకసారి నిరంతర ప్రపంచ సేవాపరాయణుండగు నారదుడీ విషయమునుగూర్చి సంప్రశ్న మొనర్చెను.

(నారదుడు భూదేవితో గానముసేయుచు ప్రవేశము.)

యమన్ కల్యాణిరాగము — ఆదితాళము.

శౌరీ మమ్మేగావా ॥ జాలమిదేలా । శౌరీ॥ పరమానందాభరిత మనోంబుజ ॥శౌరీ॥ శ్రిత జన హృద్రా జీవసుఖేలా । జితకల్మషభాసిత గుణజాలా ।శౌరీ॥ భవజలనిధిలోబడి తపియించెడి అవినీతుడ ముల్కాల్లకపినుతా ॥శౌరీ।

నార॥ (విష్ణుమూర్తి నిగాంచి) అహా! ధన్యుడను ధన్యుడను.

సీ॥ క్రొక్కారు మెరుగుతోగూడు జీమూతంబు । వలె రమాదేవితో వెలయువాని
నైర్మల్య సంఫుల్ల నాళీకముల యనా । దరమొనరించు నేత్రములవాని
వృజ్ఞాలములకు సంప్రీతి గల్గించెడి । లలితపిశంగ చేలంబువాని
నలుమొగంబులుగల్గు తొలిపలుకు దేవరకు । గన్నట్టి నాభిపంకజమువాని

గీ॥ లాలితామోదయుత వనమాలవాని । కాంతిగుల్కెడి కౌస్తుభ గళమ్మువాని
పరమ భక్తాళినుత పదాబ్జములవాని । గాంచగంటిని కన్నుల కరవుదీర

అమ్మా ధరిత్రీసుతల్లీ! అల్లదే అటుగాంచుమా. కన్నుల పండువొనర్చు రమామనోహరుని.

భూదే॥ అహా! పవిత్రురాలనైతిని.

మోహనరాగము — రూపకతాళము.

దివ్యమైనరూపంబును దిలకించితి ధన్యమయ్యె॥ది॥ అవ్యయసుఖదాయకమై అనుపమానమై వెలుంగు ॥ది॥ భవ్యమైన మకుటంబును భాసిల్లగ శీర్షంబున । నవ్యకౌస్తుభము కంఠమునకు

ఘులరారగ యొప్పెడి ॥దివ్య॥ సకల దైత్యభీకరమగు శంఖుచక్ర గదశార్ఙ్గముు ప్రకటిత ముగ ధరియించియు వరభుజంగతల్పమున । అకళంకంబుగ వెలసెడి అవనినోష్ఠ ముల్కొల్లా సుకరుండగు పావని సంస్తుతపదుఁడా నారాయణు ॥ది॥

నార॥ (నారాయణమూర్తిని సమీపించి చేతులు జోడించి)

ఉ॥ అనుపమ శోభనాస్పదములై మునిమానస వీథులెల్ల పా
వన మొనరించు శక్తిగల వైత్రి దివాపగ జన్మభూములై
వనజకదంబముఁ బరిభవ క్రియకుఁ సమర్ధములై బలీం
ద్రుని మకుటంబులైన భవదీయ పదంబుల నాశ్రయించెదఁ.

భూదే॥ (చేతులు జోడించి)

ఉ॥ సారవిహీనమై యడరు సంసృతి నిష్టవహించి ప్రేమ దు
ర్వారమునై చెలంగ సుత బాంధవ మిత్రి కళత్ర భృత్యులు
ధారకులంచు నెంచివి పదాంబుధిలోన మునుంగు వారికిఁ
తారకమైన తావక పదాబ్జమునఁ తలసోకి మ్రొక్కెదఁ

శ్రీమ॥ నారదా! భూదేవీ! మీకే విపత్తులులేక క్షేమముగ నున్నవారలా?

నార॥ దేవా! సర్వము నెరుంగువాడవై నేమియు యెరుంగనితాని చందమున ప్రశ్నించ మేమేమనువారము. (భూదేవిని వీక్షించి) తల్లీ విశ్వంభరీ! నీయాపద నా దేవదేవున కెరింగించుము.

భూదేవి॥ దుష్టశిక్షా! శిష్టపరిపాలన పరాయణ ధర్మసంత్రాణశీలా! నీవు సకలము వీక్షించుచు కనులు మూసుకొని యేమియు యెనర్వజాలనివాని చందము వర్తిల్లుచుండ మాబాధ లుపశమింప జేయువారలెవరు?

శ్రీమ॥ మీకుగల్గిన కష్టములెవ్వియో వచింపుడు.

భూదే॥ నేనుభరించు కష్టము లేకునుదాన. జనులెల్లరు విద్యాగంధ రహితులై కామక్రోధాది గుణంబులకు లోనై కర్మజ్ఞానభక్తుల మరచి, శాంతి దయా తపస్సత్యంబుల కాలదన్ని పరోపకార మన్నమాట స్వప్నమందైన స్మరింపక అల్పాయుష్య, అల్పారోగ్య, అల్పాకార్య, అల్పాలోచన, అల్పశరీరులై, నిర్వీర్యులై, మహాశోకపీడితులై, హింసాసత్యద్యూత పాన జారచోరాది కృత్యములందు బద్ధానురాగులై, స్వేచ్ఛావిహారులై స్వశరీర పోషకులై, పరాపకార పరాయణులై, ద్వేషా-సూయా మత్సరగ్రస్తులై, మందబుద్ధి గలవారలై సంచరింపుచుండ భరించుటకు నా కతిభారమై మహా విపత్సముద్రమునబడి పరితపించుచున్న నన్నుద్ధరించుటకు మీరే సమర్థులు.

అసావేరి రాగము—ఆదితాళము.

శ్రీరమణా నాచింతబాప యాధారమీవెయని నమ్మితి మదిలో॥ సూరివినుత నీవికరితిగ ననుజూచి యూరకుండ భావ్యమగునే॥ శ్రితజనులను రక్షింపకున్న నా । గతిదలంచువార లెవ్వరయ్య ॥శ్రీ॥ కరుణాకర ముల్కొల్లకేసరీ । వరతవయార్చిత పాదపంకజ ॥శ్రీ॥

(లక్ష్మీదేవినిగాంచి) చెల్లెలా! నీవైన యించుక నామారుగ నాథుని ప్రార్థించి దెల్పుము।

శిమక॥ ప్రాణేశ్వరీ విశ్వంభరీ యిట్లు ప్రపంచము మారి నేనగా నాకు చేతనోద్ధరణ బుద్ధిజనించి యేదోయొక యవతారము ధరించి ధర్మస్థాపనయొనర్తు (నారదునిగాంచి) నారదా యిక మీరరుగుడు. నేనచిర కాలమునందే చంద్రభాగతీరమున విరాజిల్లు పండరీపురమున పాండురంగ యవతారము ధరించి యాలక్ష్మీదేవిని రుక్మాబాయిగా అవతరింపజేసి నా భక్తులగు శుకనామదేవ ఉద్ధవా ప్రహ్లాద భక్తవతంసుల లోకమున బుట్టించి వారిచే కర్మజ్ఞాన భక్తి వైరాగ్యాదులు జనులకు బోధింపజేసి లోకోద్ధరణ మొనర్చి మేదినీ భారము నివారించెదపొండు.

(అని నిష్క్రమింతురు)

నార॥ చిత్తము.

భూదే॥

నార॥ మాల్కౌస్ రాగము – ఆదితాళము

కరుణాకర । హే శ్రీధరా ॥కరు॥ పరమేశ నిర్జరాపర చంద్రదివా । కరనేత్ర శోభాకరరుక్మిణీశ ।కరు॥ మునిహృత్పయోజ వనజాప్త పావన రూపఘోర దనుజాళిజైత్ర । వనమాలి దీనావన సచ్చరిత్ర । వినవేల నాప్రార్థన వాసుదేవ ॥కరు॥

(అని నిష్క్రమింతురు)

---

## తృతీయరంగము

(పండరీపుర ప్రాంతము అరణ్యభూమి)

(దివాన్ ఖాన్ అనే యొకతురుష్కుడు తుపాకిచేధరించి నిట్టూర్పువిడుచుచు ప్రవేశము)

దివాన్॥ ఆదీసుబోమె మేరే మాహాంకు దేఖకర్ బేటా తు ఖానా ఖాకర్ బందూక్ లేకర్ షికారికవాస్తె జంగల్ కుజావో బోలె అబ్ మై తోడాఖాకర్ దోదర్బి బందూక్ హాత్ మే లేకర్ జంగల్ కు ఆయా అబ్ తక్ ఫిరుపిరకే పరేషాన్ హువా. ఏకవ్యాభిన జరాయా నహీహై అబ్ కైసా ఘరుక్ జానక్యాబోల్నా (విచారించి) అచ్చా హిక్మత్ నజరాయ ఏక్ గుడ్ గుడ్ కు మార్ కె ఘరుక్ జాతాహుం (అని వొక పురుతను జూచి గురిపెట్టును)

(రామనాథుడు తాళములు వాయించుచు ప్రవేశము.)

బేహాగ్ రాగము ఆదితాళము

పండారినాథమమ్ము పాలించుమాహరి ॥పండా॥ పుండరీకాక్షానీ దండాజేరితినయ్య పుండరీకవరదకృపతో పోషించరావేల ॥పండా॥ పంకేరుహాక్షనాదు సంకటములు బాపుమి మీనాంక జనకవినుత పాదపంకజ శ్రీరుక్మిణీశ ॥పం॥ యిలను వెలయు ముల్కల్లా నిలయుడైన వాయుసుతుని । పలలితకృప కాచినట్టి సదయహృదయ పరమేశా ॥పం॥

శ్రీను। దమారమనా గోవింద హరి జాయ్ మనా పుండరీకహరి కేశవ్ హరిగోవిందా పండరీవాసగోవిందా పాండురంగా గోవిందా.

దివాన్॥ అరెఅల్లా మె క్యాకియ్యా [చిందులుగొనుచు తుపాకి కి దబెట్టి నెత్తిగొట్టు కొని రామనాథునిపైకురికి] ఘూంతేరె ఘోయిం—ఘోయిందా బోల్కే యిత్నా ఘుడ్ బిడ్‌కర్కే మేరా బడాషికార్ ఖరాబ్ కర్దియారె (తుపాకి తీసుకొని) తుంకుబందూక్‌సే హుడాకర్ హలాల్‌కర్తాహుం దేఖోహంకుబోహాత్ ఘుస్సాఆయా (పైపైబోవును)

రామ॥ సాహెబుగారు.

దివాన్॥ సాహెబ్ నహీ గీయెబ్ నహీ మార్తాహుం.

రామ॥ ఎందులకీ కాకిగోల. ఎందులకీ కోపము. ఎందులకీయాతురత.

దివా॥ అరేతుకవ్వోంకి సమాజ్ కోక్యార్ హమారా బడాషికారి ఖరాబ్‌కరె ఫిర్ హోంకు కవ్వోంకి సమాజ్ కోనహో బోలె నాలాయక్

రామ॥ నవ్వి ఓహో నాహారంభజనచేత నీషికారి పాడైనదనియా నీకోపమునకు కారణము నేనొకటిచెప్పెద వినుము.

మ॥ వనిలోపర్ణ తృణంబులన్ దిని నదీపానీయముల్ గ్రోలిఖే
లనగావించెడి సాధుజంతువుల నిర్లజ్జాభిమానుండవై
వనటన్ నొందుచు జంపవాడియగు నే ప్రాల్మారియున్ మాంసభో
జనుడౌవానికి శ్రేయమున్ గలదె హింసాదూరుడే పూరుషా॥

నీవు మానవుండవై జూదము వేటయు పానము అతిభిక్షణాసక్తియు యీనాలుగు దుర్వ్యసనములని తలంచక యిటు చరింప పాడిగా.

దివాన్॥ అరేదివాన్‌దర్ హమేషా ఘోయిందాఘోయిందా బోల్‌కరు ఫిర్నే వాలేకు ఘోషుకా మజా క్యామాలుం యేక్ దిఫా ఘోషుఖా నేత్తో తుంకభి నహీంఛోడ్తే. దేఖో హమారేపాస్ చాయు పాంచక బాట్ హై దేతాహుం ఖావో వుస్‌కా మజా మాలుంహోతే.

రామ॥ ఛీ దుష్టుడా తాజెడ్డకోతి వనమెల్ల జెరచె నన్నట్లు నీవుచెడిందేకాక నన్ను గూడ చెరుప నెంచితివా.

దివాన్॥ అరే తుమారే యేథంమే (మాసంమాంసేన వర్ధతే అని బోలైహె.

రామ॥ అది సామాన్యవచనము దానిని విశేష వాక్యము ఖండించుచున్నది (యెట్లన్న (ఆత్మవత్సర్వభూతాని – అహింసా పరమోధర్మ) అనియు గాని నీవనునదే విశేష వాక్యముగా వాడుదమన్న మాంసం మాంసేన వర్ధతే) మాంసముచేత శరీరమాంసము వృద్ధి నొందుచున్నది. శరీరము యెట్టిది కుండవంటిది. శీర్యతి ఇతి శరీరము అది యెన్నడైన నశించు స్వభావముగలది. అట్టి శరీరమునకు మాంసము వృద్ధిపరచిన లాభమేమి క్షణ భంగురమగు శరీర సౌఖ్యమునకు నాసించి ఆత్మహత్యల గావించువారికి జయము గల్గునా. నీకె నిశ్చయాత్మక బుద్ధిగలవాడవయి యోచింపుము.

దివాన్॥ అరెబాప్‌కె యెబాత్ సాచ్ సచ్చిహై.

రామ॥ అన్ని జంతువులు మానవుల కుపకారార్థ మొనర్చుటకై భగవంతుడు నిర్మించెను. నేటినుండి నీవేటమాను.

సీ॥ ఫలకన్నములదిని వెల సొంపక్షికుంటి । కెవను మీకేమి గలుగఁజేసె
ఆకులలములుమేయు మేకలు నోరయుంచ । పీడమీకేమి ప్రాప్తింపజేసె
కసువుల గింజలో గ్రాసంబు గొనుకోళు । యపకృతి మీకేమి యాచరించె
నీటిలోగ్రౌడి కీటకంబులుదినుచు । చేపలుమీకేమి చేటుజేసె

గీ॥ కన్నబిడ్డల చంద బు గావరమున । సాకికొనులై పిన్నటు చంపిరుచ్య
మనుచు భక్షించి మర్త్యులై జనుటమేలే । జంతుగోకులులేవె మీస్వాంతమందు॥

వ॥ ఆయొరవకు రక్తము వాటితలలోగల క్రిములు వాటి ప్రేగులలోగల్ల దుర్గంధ మలము మీకిట్లు యిష్టపడును.

దివా॥ ఆజ్ సే మైక్యాకర్న జగాబోలో ఆప్ కు సలాంకర్తాహుం.

రామ॥ నేటినుండి నీజంతుహింస మాని భగవత్ నామానుసంధాన మొనర్చుచుండుము. నీకిహపరసుఖము చేకూరును [యిటునటుజూచి] యికబొమ్ము ప్రొద్దుబోవుచున్నది నేనెరుగవలయును

దివాన్। కిదరు జాతే పండితమహరాజ్

రామ॥ పండరిపురమునకు.

దివా॥ కిస్ వాస్తె.

రాము॥ భక్తుల పాలిటి ముంగొంగు పసిడియగు పాండురంగని సేవించి తీర్థప్రసాదము అను గ్రహించి చిన్యాసు దర విగహమును సేవించి ధన్యాత్ముడ నయ్యెద.

దివాన్॥ ఆప్ కు సలాం కర్తాహుం హాక్ సాథ్ లేకరుజావో మైపాండురంగణి భజన్ కర్తాహుం జగామైకో ఘుర్కుజాకిరు బందూక్ చోడ్కె మేరామాతాకీ బోల్కె అతాహుం.

రాము॥ (నవ్వి) సాహెబుగారు.

గీ॥ పాండురంగణి భజనకై బంధుజనుల । పదతి తలిదండ్రి యోజల బడయునేల
పాడుదేహంబుకేనీరు బంధుజనులు । గాని పరలోకసాధకుల్ గానరజను॥
నీపిచ్చిభ్రమలుమాని అలసి ఒక నాదిక్కు జేత్రమున కరుపుదము రమ్ము

దివాన్॥ అచ్చా చెలియే.

రామ॥ హరిభజనకు జను సమయమున యీ ఆయుధములు నెందులకు వీటి నెక్కడనైన పార వేయుము.

దివాన్॥ అచ్చా (అని బందూకు నొకచోటబెట్టి) చెలో

రామ॥ ధన్యాసిరాగము - ఆదితాళము.

పాండురంగ మంగళకరమాధవ పుండరీకనయనా ॥పాం॥ అండజవాహన కుండలిశయనా మండిత కౌస్తుభ మణిగణభూషశ్రీ ॥పాం॥ వనజభవార్చిత చరణా । దనుజహరణ పావన శ్రీరమణా ॥పాం॥ ధరణివెలయుచు నుల్కల్లి సమీరణ । వరతనయార్చిత చరణకీసలయా ॥పాం॥ (నిష్క్రమింతురు)

---



# నామదేవ కల్యాణము

## ద్వితీయాంకము

### ప్రథమరంగము

(పాండురంగ దేవాలయము)

కొందరు భక్తులు కూర్చొని భజనసేయు చుందురు పూజారి విశ్వనాథమనునతడు స్వామినర్చించుచుండును

విశ్వ॥ అసావేరిరాగము ఆదితాళము.

శిరమణీశ్వర శ్రితజనసులభపద సారసభవభయ దూరహారీ ॥శ్రీ॥ కరుణాకర శుభకర చరితా నరకాసుర ఘనమదవిజితా ॥శిర॥ దరహసితానన సరసిరుహా । పరిమళయుత వనమాలాగళా । వరముల్కల్ల పురీశ్వర తరుచర వరదపరాత్పర సురవినుతా ॥శి॥

శ్లో॥ ఉత్తిష్ఠోత్తిష్ఠ శ్రీరంగ । ఉత్తిష్ఠ పురుషోత్తమా ।
ఉత్తిష్ఠ కమలానాథా । భక్తౌఘం పావనంకురు॥

అర్ఘ్యపాద్యము లొసంగి భక్తులనుగాంచి యింకను పరమభాగవత శిఖామణియగు దామాజిగారు రానులేదా.

రామ॥ అయ్యా దామాజిగారు స్నానకర్మానుష్ఠానాది విధులొనర్చుటకై గృహితో చంద్రభాగ తీరమునకు జని స్నానమొనర్చి అనుష్ఠానాది విధులొనర్చి కొందరి భక్తవతంసులగూడి అటనే భజనానంద నిమగ్న మానసుడైయుండ దిలకించితిని అతని భజనమేమనువాడ.

సీ॥ ప్రకటిత ప్రణవాక్షర ధ్వనిగనుచున్న । తంబూర కుడిచేత దనరుచుండ
చిరుతగజ్జెలతో భాసిల్లెడు చిరుతలు । దాపలిచేతిలో తాండవింప
మార్గ్రియరాగ సమంచితకీర్తనల్ । శ్రుతితాళమూర్ఛన గతులనొప్ప
కాళ్లగజ్జియలు నిక్వాణంబు కోత్రప । ద్వాతుగ విఖ్యాతమై వరలుచుండ
గీ॥ ముత్తెములయట్లు యశ్రువుల్ ముద్దుమోము । నందుభాసిల్ల సంతతానందమైన
భక్తిచేకన్నులరమోడ్చి పక్షిగణము । చలమునుమాను భజనంబు సల్పుచుండె॥

వ॥ ఆట్టితరుణమున సాధ్భక్తవతంసుని హృదయమెట్లుండెనోయూహించ నెవరితరము (ఇంచుక యూరకొని) అయ్యా మిమ్మొక్క విషయ మడుగవలయునని కోరిక గల్గుచున్నయది అడుగవచ్చునా.

విశ్వ॥ నిస్సందేహముగ.

రామ॥ దామాజిగారు శూద్రకులజుడని వినియుంటిని నిశ్చయమా.

విశ్వ॥ వెర్రివాడ ఎంతమాట.

మ॥ కులగోత్రంబులు రూపవయోభవము | వాక్యార్థత్వ భేదంబులన్
దలుపన్ నేటికి రొట్టెవాడయిన | నయిదర్భి మనోవాధుని
శ్చలభక్తిన్ వినుతించె నేని కలుష | స్సంఘాతమున్ ద్రోచివ
ర్తిలు శ్రీభాగవతోత్తముండనుచు | ధాత్రిన్ పూజనీయంబుగా॥

సకలలోక సార్వభౌముడగు పాండురంగని గొల్చుటకు సేవించుటకు కులగోత్ర స్త్రీపుంన్నపుంసకముల విచారించ నక్కరలేదు. అయిన నీవడిగినందులకు జెప్పెద వినుము అతడు శూద్రకులమునందుద్భవించి కుట్టుపని జేయుచు మేతవాడని అనుపమాన కీర్తివహించి నడు అతని సద్గుణముల నుపమానములు.

సీ॥ స్వప్నమందైన హాస్యమునందునైనగాని | దబ్బరలాడని తథ్యమూర్తి
తనప్రాణధనములకోసెడివారలనైన | నిందించబోని నానందయుతుడు
తనరీతి సకల భూతశ్రేణి సతతంబు | కరుణార్ద్రహృదయుడైగాంచుమతుడు
ఘనతరంబైన రాగద్వేషములనెల్ల | బోకడంచినయట్టి పుణ్యమూర్తి
గీ॥ ఇంద్రియంబుల గెల్చిన పేంద్రులీల | అఖిలమంతయు విష్ణుమయంబటంచు
దలచు శ్రీహరినామ కీర్తనమునందు | మనసు నిల్పిన భవ్యదామాజి ఘనుడు॥

(సంసర్గదోషేణ గుణాభవంతి) యనునట్లు అమహనీయుని గృహిణియగు గుణాబాయి సుగుణ సంపద వర్ణనీయమే.

రామ॥ ఆసాధ్వీమణి గుణములించుక దెల్పి ధన్యునిగా జేయుడు.

విశ్వ॥ శ్రీరాగము — ఆది.

ఆరమణీమణి గుణవిఖ్యాతిన్ | వినుతించ శక్యమె ॥ఆ॥ సారసాక్షి విస్ఫారశాంతియుత కీరవాణి దూరకలుశ మానస ॥ఆ॥ నెలజవ్వనంబు నెలతరూపమును తెలుపు చెలువు చూపుల వినోదము ॥ఆ॥ ధరణివెలయు మల్కాల్లపురికపి | వరదుడైనహరి గొల్చుసతతము ॥ఆ॥

సీ॥ పతిపదాంభోజ సేవానంద సామ్రాజ్య | సింహాసనంబధిష్టించె సుమతి
శాంతిదయాచార సౌధరాజంబుపై | విహరించునట్టి సాధ్వీలలామ
అతిథిసత్కారభా | గ్యాబ్ధివీచిక పరం | పరదేలియాడెను తరుణిమిన్న
సత్యవ్రతసుధా స్వాదనంబొనరించి | మత్తిల్లిగాలెదు మధురవాణి

గీ॥ కలుష సాంద్రాంధకార వికారదూరి । శాంతగుణయుత భవ్యవిశాలచిత్త
అన్యపురుషుల సోదరులంచుమదిని । దలచు యీగుణాబాయి వర్తనము భళిరే॥

అతి దారిద్ర్యమైనను వారిరువురు యించుకేనియు దుఃఖమనుమాట యెరుంగ భగవత్తీర్థ ప్రసాదములచే సంతోషము నొందుచు నిరంతరము భగవన్నామాను సంధానముచే కాలము గడుపుచు యొప్పారుచుండిరి. అట్టివారలు యెట్టికులమున జనించిన ప్రశంసపాత్రులు గారా.

రాజు॥ (ఆశ్చర్యమున) యిట్టిసుగుణములు మానవులకు పూర్వజన్మ సుకృత విశేషముచే పట్టుబడును. యింతవరకు నేను అజ్ఞానాంధకార నిమగ్నచిత్తుండనై దామాజిగారు శూద్రకులజాడు నేనగ్రజన్ముడను నాన యోగ తపోవంతుడనని గర్వాంధుడనై సంచరించితిని యిపుడు నీకుబోధవలన నాగర్వంపటాపంచలైనది యీక వేలజన్మము లెత్తినను దామాజిగారిని అందుకొనజాలను.

(దామాజి గుణాబాయితో ప్రవేశము)

దామా॥ మోహనరాగము – ఆదితాళము

మురహరకృపాకలితా । శ్రీనేతా ॥ముర॥ నరకాసురహరణా దీనావన ॥ముర॥ దరహసితానన సరసిజ కౌస్తుభ । ధరకంధర రాధామనోహర ॥ముర॥ నవభాసితపల్లవసమకోమల । కువలయదళ నీలాసుశీలా ॥ముర॥ ఘనచరిత్ర ముల్కుల్ల సమీరణ తనయవినుత పాదా వినోదా ॥మురా॥

దేవీ ఆటుగాంచుము.

శా॥ కానన్దృక్తతికిన్ ప్రమోదకరమై । గాలెన్సుధాదీప్తిచే
నానాచిత్రిత చిత్రసాంద్రమురు సంతానంబుచే హేమకుం
భానూనప్రతి భాన్వితంబుచేకుక । ధ్వానంబుచే సుందరం
బైనవ్యప్రభ గుల్కుచున్నారి । బహిర్ద్వారంబు పూజ్యంబుగా॥

గుణా॥ (ఆలకించి) నాథా అదుగో ఘంటలనాదము మ్రోగుచున్నది స్వామికి నివేధన యగుచుండవచ్చును.

దామా॥ తొందరగా నడువు (అని నడచుచుందురు)

దామా, గుణా॥ (ఆలయమున ప్రవేశించి) పండరీపురవాస గోవిందోహరి (నమస్కరింతురు)

విశ్వ॥ దామాజిగారు విచ్చేసితిరా స్వామికి పూజానివేదన మొదలగు కార్యములు జరిగినవి. కాని మీరు రావలయునని మంగళాశాసన మాపితిని వొక మంగళారతి పాడుము (మంగళారతి ముట్టించి)

దామా॥ మంగళారతి బేహాగ్ – ఆదితాళము

ఆరతి శ్రీరంగా । మంగళ ॥ఆర॥ సారాసారవిచారమానస ॥ఆర॥ వేదకామినీ శిక్ష

సుఖేలా । శ్రీదయితారక్షిత శ్రితజాలా ॥ఆర॥ గిరిధర మంగళచరితాభవభయ । హరణా భక్తోద్ధరణపావన ॥ఆర॥ కరుణాకర ముల్కల్లపావనీ । వరదాశ్రితజనవాంఛితప్రదా॥ఆ॥

(నమస్కరించును)

విశ్వ॥ నిత్యశ్రీరస్తు నిత్యమంగళాని భవంతు సతతం శ్రీరస్తు సమస్త సన్మంగళాని భవంతు చతుస్సాగర పర్యంతం గోబ్రాహ్మణేభ్యః శుభం భవత్ [భక్తులందరికి మంగళారతి చూపును అందరు నమస్కరింతురు భక్తవతంసులారా తీర్థప్రసాదముల స్వీకరింపుడు (అందరు తీర్థప్రసాదములు స్వీకరింతురు పాండురంగస్వామికి భక్తులు నమస్కరించి నిష్క్రమింతురు.

గుణా॥ (చేతులుజోడించి) దేవా పాండురంగా భక్తవత్సలా.

అసావేరిరాగము - ఆదితాళము.

భగవన్ శ్రీరమణా । పాండురంగా ॥భగ॥ జగదోద్ధార నగధరమురహర నిగమవేద్య సాన్నిధ్యమొసంగవె ॥భగ॥ వజ్రిసుందరి హృద్వనజ విభాకర సుజనావన భవసూదన శ్రీహరి ॥భగ॥ కామజనక ముల్కల్లపవనసుత । కామితార్థ దాయకపరమేశా ॥భగ॥

వ॥ నీభక్తులమగు మమ్మెంతకాలమిట్లు పరీక్షించెదవు సర్వభూత దయాపరయను నీబిరుదము సార్థ పరచుకొనకయుండుట ధర్మమా,

మ॥ పురుహూతాత్మజుపై విభీషణునిపై । భూతేశుపై గోపికా
తరుణీబృందముపై కుచేలుపయి । రాధాదేవిపై కుబ్జపై
కరిపై శంతను పుత్రుపై విదురుపై । కాకోదరాట్పైన నీ
కరుణన్ జూపినయట్లు మాపయిన । రంగాజూపవే శ్రౌక్కదన్॥

(నమస్కరించును)

దామా॥ యమన్ కల్యాణిరాగము - రూపకము.

తెలియరద్భుతము । భవదీయనవ్యలీల జాలము ॥తెలియ॥ జలజగర్భ వామదేవసంయమీశ్వరులుయోగులు అలఘుమతులు సురకిన్నెరులరయలేరు చిత్రముహరి ॥తెలి॥ సకలప్రపంచము రంగస్థలిగా నొనరించిజీవ ప్రకరముచే సొగసుగ నాటగ మాడింతువు భళిభళి ॥తెలి॥ నవనవతారంబుల నవ్యగతినిధరింతువు భువినివెలయు ముల్కల్లపవనాత్మజు వందితపద॥తెలి॥

వ॥ కాష్ఠమునందగ్ని ప్రజ్వరిల్లు చందమున సకల చరాచరముల యంతంతరాత్మవై ప్రకాశించుచు జీవులొనర్చు సుకృత దుష్కృతముల వీక్షింపుచుందువు భవదీయ నిర్మితమగు మాయజాలము త్రెంపుకొనజాలక జీవులు అజ్ఞానాంధత్వమున మునింగి తను ధన ఘనములే శాశ్వతములని దలంచి నారక కృత్యము లాచరించుచు విర్రవీగుచుందురు. వారెన్నటికి నీదృష్టిపథములో బడరుసుమా (విచారించి) అదియెట్లు యిదమిద్ధమనినిశ్చయించువారెవరు నిగ్రహానుగ్రహ సమర్థుడవగు తావకీన కృపాగుణము యజనయాజనాది కృత్యములొనర్చి పవిత్రుడై మోక్షసౌధ మారోహించ సిద్ధమగువానిని అంతులేని నరకమున

శ్రోతువు నిరంతరము పాపకృత్యము లొనర్చుచు కుంభీపాకమున కరుగువానిని మోక్ష సాధ మారోహింప జేసెదవు యీ రెంటికి నీవే సమర్థుడవు దీనికి నిదర్శన మేమన.

ఉ॥ పారుడు మున్న జాముళుడు । భానిళియందను రాగుడైదురా
చారపరాయణత్వమున । సంతతిగాంచియు చిన్నపుత్రుని నీ
పేరున నంత్యమందునను । పేర్కొనకాలుని భృత్యవర్గమున్
పారయొనర్చి భక్తునిగ । భవ్యునిగా యొనరింప వేహరీ॥

యిట్టి అసాధారణమగు నీగుణగణంబుల లెక్కించ వేనోళ్ళ చిలువకైన శక్యమా.

సీ॥ దండంబు పద్మ భవాండభాండానేక । నిర్మాణ విస్ఫార నిపుణనీకు
జేజేలుయోగి హృద్రాజీవ సంస్థిత । ప్రకటితకిసలయ పాదనీకు
జోహారువాక్షుస ప్ర్యాహగర్వాటోప । సారంగరాజ పంచాస్యనీకు
వందనంబాశ్రిత సందోహశతపత్ర । ప్రీత్యావకాల సప్తాశ్వనీకు
గీ॥ నైకసాష్టాంగములు రసానాథనీకు । ప్రణతులమ్మృతచరిత ప్రభావనీకు
బహునమస్కారము వీరవర్యనీకు । అనంత సేవాంజలులు దివ్యాత్మనీకు॥

(నమస్కరించును)

కాంతామణీ యికపోవుదము రమ్ము.

గుణా॥ చిత్తము.

దామా॥ ఆరభిరాగము - ఆదితాళము

వేదాంత మెనుఖము । విశ్వల ॥వేదా॥ మేదినిపైగల సుఖము లకన్నను ॥వేదా॥ వాదభేదముల మానియు శ్రీహరి పాదపద్మములు భజింపుచుండెడి ॥వేదాం॥ తనయపుత్రహిత ధన నిశాంతములు । వనితాపరిష్వంగన భోగాదులు । ఘనభవహము గాదేమనసా । ఘన మాల్కల్లా కపివరుసాక్షిగ ॥వేదాం॥

(నిష్క్రమింతురు.)

---

## ద్వితీయ రంగము

### దామాజిగారి గృహము

దామాజిగారు మరికొందరు భక్తులు దివాన్ భజనయొనర్చి పడుకొనియుందురు.
గుణాబాయి కూర్చొనియుండి

గుణా॥ (తనలో) భాగేశ్వరిరాగము - ఖండితగతి

దీనజనరక్షణ మెగానీపబిరుదు ॥దీన॥ దానవనిచయ సంహారణా వనజాక్షా శుభకర ॥దీన॥ జ్ఞానస్వరూపసచ్చరిత మెరుగగలరా భూనాథవంద్య పూజిత పాదవనజ ॥దీన॥ భక్తార్తిదూర కుంభద్వాస్య ధారేయముక్తకుల జనతతి ముల్కల్ల కపినుతా ॥దీన॥

వ॥ (అందరినిజూచి) ప్రాణేశ్వరుడు భక్తవతంసులు యిందాక భజన మొనర్చి నిద్రించినరు. నాకింక నిద్రవచ్చుటలేదు. భజనమొనరింతమన్నను నేటికి ఆరుదినము లయ్యె భగవత్తీర్థ ప్రసాదములుదప్ప వేరే భోజనమనుమాట లేకుండుటచే కడుపులో చేయిపెట్టి కలిపినటుల కన్నులు పచ్చగానై భూమ్యాకాశము ఏకమగునటులమరొకతరియీ భూచక్రమన్తయు కులాలచక్ర చందమున గిరగిర దిరుగునటుల గాన్పించుచు మాటలు తడబడుచున్నవి. యీపొడు దారిద్ర్య పిశాచము మమ్మావరించుట చేతనేగదా మాకీ కఠినోపవాసదీక్ష (సాధునిగాంచి) సాధునకు యీదాద్ర్యమే సుఖముగా దోచుట చేతనే వ్యాపారమనుమాటకు స్వస్తిచెప్పి ఆజగదేక ప్రభువగు పాండురంగని భజనానంద నిమగ్న చిత్తకమలుడై వర్తిల్లు చుండెను నేనైన కులవృత్తియగు కుట్టుపని జేసెదనన్న వల దు. ఆ పని మానుము. పరులయాచించిన ఫలములేదు. నిరంతర భక్తజన ఆపన్నివారణ ధౌరేయుడగు పాండురంగని స్మరించుమని అనారతము చెవినయిల్లుగట్టిన చందము వచిం పుచుండిరి. వారి వాక్యము వినకుండుట ధర్మముకాదు. నాకును యిక పాండురంగని భజనమే కర్తవ్యము (భగవాను నుద్దేశించి) దేవా భక్త జనానందదాయకా. పాండురంగా యితర దేవతారాధనము మాని యితరాంతరముల విసర్జించి యితర సాధనముల గడ గాలదన్ని మంత్రరాజమగు నీదివ్యమంత్రము స్మరింపుచు జగదేక సుందరమగు తావకీన అర్చావతారము పూజించుచు కాలము గడుపు మమ్ముద్ధరించు బుద్ధి నీకేల జనించదయ్యె.

శా॥ నావిజ్ఞప్తి పరాకుచేవినవో । కర్ణంబుగ్ వినంరావో ని
దావేశంబున చొక్కుచుంటివో । సుదన్తా భద్రకాళిందిస
త్యావైదర్భి వివాదమాన్పుటకు । కార్యంబేదొ యూహించ నీ
భావంబుగ్ వికలంబునొందినదో । దేవాపాండురంగప్రభో॥

నిరంతర భక్తార్తి విదూరుండను నీస్వార్థక నామము నైన తలంచకుంటివి భక్తవర్గము సంకట పడుచుండ దక్షిణ నాయకత్వము వహించి రుక్మిణ్యాది కాంతాలోలుడవై విలాస ముగ యలరారుట భావ్యమా పుత్రవర్గము పడరాని పాట్లు బడుచు యుండ హాయిగా సుఖించు తలిదండ్రులుందురా నిన్ను నేకభక్తవర్గము అనంత కల్యాణ గుణగణ సమేతుండ వని వర్ణించగ ఆలకించితిని అందు నొకటియేనియు నాకు కాన్పించుటలేవు గోవిందా.

సీ॥ అగచాట్లు పడెడి ప్రహ్లాదునేలిభవ । త్వాత్సల్య మెచ్చోట వరలుచుండె
విముఖత్వమొందు విభీషణు గొసగునీ । యభయదానంబెందు యడరుచుండె
గ్రాహంబుచేజిక్కు కరిపైన జూపునీ । యార్తిజైత్రిత్వ మెందరిగియుండే
వస్త్రంబులిచ్చి ద్రౌపదిగాపాడునీ । యౌదార్యమెచట పాడైయ్యియుండె
గీ॥ రాతిగుండును వన్నెల నాతిజేయు । యుమ్మదఘశోషణంబెట యొదగియుండె
ధృవనకొసగిన అగణిత శ్రేయగుణము । తపముసేయుచు యెచ్చోట దనరుచుండె॥

(ఇంచుకయూరకొని) నిన్ననవలసిన పని యేమియులేదు యిది యంతయు మాపురాకృత కర్మఫలము (చెంపలుగొట్టుకొని) స్వామి పాండురంగా పైత్యము ప్రబలిపోవుటచేత వొడలెరుంగక నిన్నెత్తిపొడపు కూతల కూసితిని క్షమించుము.

భాగేశ్వరిరాగము - ఆదితాళము.

సూరినుతాచరణా । భవభయ తరణా । రిపు హరణా ॥సూ॥ పరమపురుష నామొరవినవా హారీ శరణాగత రక్షణ తత్పరుడవె॥సూరి॥ భక్తజనుల యాపదలదోలయా సక్తిపరుడవీవే గద శౌరీ ॥సూరి॥ దురితులమంచని నరయక తావక కరుణజూపు ముల్కాల్ల కపినుతా॥సూ॥

దివా॥ (లేచి నలుదిక్కులగాంచి) అరేబాపురే యేసాధ్వీరత్న అబ్ తక్ హరి నామస్మరణ్ కర్కే జాగరణ్ కరీహిధీ మై ఐసాదర్ హమేషా భగవాన్ కు భజన్ కరేతో దోరోజుమె మైండ్ కరాబ్ హోకర్ పాగల్ హోజాతాహుం హరి భజన్కే ఏక్ వఖుతు రహిన దిన్ కు ఏక్ గంట బల్కే దోగంట ఠీక్ హై ఐసాకరేతో ఏక్ దిన్ మె పైత్యరోగ్ సె మక్కాకు జాతాహుం.

గుణా॥ దివాన్ నీకు నిద్ర పట్టుటలేదా.

దివా॥ అబ్ తక్ భక్తమండలిమె మిల్ కర్ భగవాన్ కు యాదికర్కే పరేషాన్ హోకర్ సోగయే. థోడా నీంద్ ఆగయా, మగర్ ఆప్ కా తాంబూరోంకి నినాద్ కా నోంకి సునాయ నీంద్ గంద్ చంద్రభాగ్ కి నారేతక్ చెలేగయా పరంత్ కుఛ్ సబ్బోధ కరో సుంతాహుం.

గుణా॥ (తనలో) మహమ్మదీయుడై సదా దుకార్యా చరణుడై యొప్పువీడింతలో సన్మార్గుడైనవాడు. సత్సాంగత్యమేది గలిగించక పోవును. (లేచి ఆకాశము పలక్షించి) యిపుడర్ధరాత్రము దాటినది (దీపము వెలిగించి నొక పుస్తకము దీసుకొని వచ్చి కూర్చుండి పుస్తకము చూచుచుండును.

దివా॥ మాతా ఏగ్రంధ్ కా నాంక్యాహై.

గుణా॥ పతివ్రతా పారిజాతము.

దివా॥ ఆతురతతో అచ్చా పడో సుంతాహుం.

గుణా॥ చదివెద వినుము స్త్రీలకు సముచిత ధర్మమేమన.

సీ॥ పతివాక్సుధార సపానమత్తత శోత్ర । పుటములకంచిత భూషణములు
ప్రాణనాధునిపాద పద్మసంసేవహ । స్తములకు వలయు ప్రశస్తసమతి
ధవునినామానుసంధాన తత్పరతజి । హ్మకునిత్యభవ్య నైర్మల్యసిద్ధి
భర్తసుందరముఖ పద్మనిరిక్షణ । దృక్జాలములకు సుస్థిరఫలంబు
గీ॥ జీవితేశుని భోజనోచ్ఛిష్టశేష । భోజనంబాత్మ కవిరళ పూర్ణసుఖము
ప్రాణపతి సత్కృపారస పాత్రురాలు । నైనసతిభాగ్య మెన్న శక్యంబెతలుప॥

వ॥ యిట్టి గుణంబులుగల్గి భర్త కురూపియైనను అంధుడైనను వికలాంగుడైనను శ్రద్ధాభక్తిగల్గి పరిచర్య లొనరించుచు వర్తించు కాంతారత్నమునకు వ్రతములేల తపము లేల జపవిధానాది కర్మలేల నిరంతరము భర్తతోగూడి సౌఖ్యనిధిన యలరారుచుండును మరియు.

మ॥ స్వనిశాంతంబున జాణయై మహిత । శోభాసక్త శృంగారయై
ఘనసత్యవ్రత దీక్షుయైపతిని వేడ్కన్ । రంజిలన్ జేయుచున్
వినయాధిక్య మనస్కయై నతిథులన్ । విష్ణుండె యభ్యాగతు
డనిపూజించుచు నున్నసాధ్వియని । విఖ్యాతిన్ గనున్ మేదినీ॥

దివా॥ ఐసీ స్త్రీసే సంసార్ కరేతో బోహత్ ఠీక్ హై వుస్ కా మర్త్యోంకా జీవన్ ధన్యహై (ఆలోచించును)

గుణా॥ ఏదియో విచారించుచుంటివి.

దివాన్॥ మేరా జోర్ కా పాన్ ఐసీ గుణవ్రపర్తనహై నహీ హై కర్కె విచారణ్ కరేతో అబ్ తక్ ఆప్ బోల్దియె గుణగణ ఏక్ బీనహీహై వుస్కా ప్రవర్తన్ ఐసీహై నిరంతర్ హాంసే వివాదకర్కె హాంకు జాడ్ సే బీస్ పచ్చీస్ మార్ పిర్ వున్ గోతాహై పరామోంకి లక్ష్మీహై స్వగృహోంకి పిశాచ్ హై క్యాబోల్నా వున్కె దుర్గుణగణో గిస్నేవాలే కోన్ నహీహై వున్కు క్యాకర్నా.

గుణా॥ అట్టిది మేకవన్నె పులి పడిమందిని గన్న సంతానవంతురాలైనను బుద్ధి వంతుడగువాడు పరిత్యజించవలయును.

దివాన్॥ అరేబాపురే వున్కె చోడేతో కోన్ ఖానాసాలన్ పకాన కోన్రోటీ పకాన హాంకు కోన్ హర్ రోజ్ సే జాడ్ సే మార్నా వున్ కు చోడేతో మేరే మూంమె మట్టి బిడాలెవాలె కోన్ హై.

గుణా॥ (తనలో) సంతానమనుమాట జ్ఞప్తికి వచ్చినంతనే నాహృదయము ఝల్లుమని ద్రవీభూతమై ఆపజాలని దుఃఖము వచ్చుచున్నయది.

బీన్ ఫలాస్ రాగము ఆదితాళము.

బాలురులేని యీపరితాపము నాకేలీలను జనునోగద రంగా ॥బాలురు॥ కాలమెల్ల గడచుచుండె సంతతి గనవైతిని నాగతి యెట్లగునో ॥బాలు॥ పుట్టువంధ్యనై బుట్టితివంశము బెట్టుల వృద్ధికి వచ్చునో కటకట ॥బాలు॥ లాలితమగు ముల్కల్ల కపివినుత శ్రీలావణ్యప యోాథిగావవే ॥బాలు॥

చ॥ సరసతలేని వాక్యము । ప్రశాంతములేని తపంబు దేవమం
దిరమునులేని గ్రామము । సునీతియులేని నృపాలమండుగ్లాః
విరహితమైనశర్వరివి । వేకములేని వరుండు పుత్రహీ
నరమణి జీవితంబు । సుజనాళి వృథాయని పల్కుచుందురన్॥

( పుత్రేణలోకాన్ జయతి - అపుత్రస్య గతిర్నాస్తి ) అను శృతి ప్రమాణము జ్ఞాపకమునకు గచ్చినంతనే మితిలేని శోక దవాగ్ని కీలలు జనించి హృదయారణ్య సీమ దహించుచుండును అక్కటా,

చ॥ కుమరులవచ్చిరాని పలుకుల్ విని । సంతసమందువారిభా
గ్యమువినుతించ శక్యమె । పరికంపిత తద్గమనంబు నేత్ర ప
ర్వముగను గాంచి నెత్తిముఖ । పద్మముముద్దిడి స్తన్యమిచ్చి ప్రే
మమునను బెంచుకాంతల । సమంచితపుణ్యము నెన్న శక్యమే॥

నాతోటికాంతలు సదా బాలురచే సుఖముగా కాలము గడుపుచుండ నేపుట్టు గొడ్రాలునై నుండుటచే వారిని గాంచ నామనంబున యెక్కడలేని సిగ్గుగల్గి మనశ్శల్యమై బాధింపు చున్నయది (విచారించి) సగమీడు చెల్లినది సంతతి గాననైతిని దైవమా.

సీ॥ పసిపాపలనుగాంచి పాలిచ్చితలకంటి । జలకంబులాడించ జాలనైతి
ఉయ్యాలలోపాప నుంచిజోజోయని । పరిమదంబుననుపాట బాడనైతి
పలుతెరంగుల కూసములు కుళ్ళలుంచియు । కనులకాటుకబెట్ట గాననైతి
మూర్ధంబునాఘ్రాణమునుజేసి ముఖపద్మ । మునుముద్దుచెలించి తనయనైతి
గీ॥ అంగరక్షలనుంచి నుత్సంగమందు । జేర్చిజోకొట్టి సుఖనిద్ర జెందుమనుచు
బూచివచ్చియు నల్లదే నాచియుండె । యనుచుతనయులతోబల్క నైతియకటా॥

వ॥ ఆభగవానుడగు పాండురంగని యనుగ్రహముగల్గిన సంతతి కల్గకుండునా (విచారించి) పాండురంగనికి మామీద యించుకయినను అనుగ్రహము కల్గకుండెను. యింతకు మాపూర్వజన్మ దుష్కృత్యము నే నిందించవలయును కాని ఎంత విలపించిన యేమి లాభము.

దామా॥ [కదలుచు] భక్తత్రాణపరాయణా పాండురంగ పాహిమాంపాహిమాం పాహి.

దివాఙ్॥ యేభక్తశిఖామణ్ నీంద్ మే బీహరి గుణగణ్ ధ్యాఙ్కర్ రహాహై యిన్కా.భావ్ అచంచల్ హై.

దామా॥ (లేచుచు) నీలాంబరిరాగము - ఆదితాళము.

కావవేరరంగా । పావనాంగ భవబంధవిభంగా ॥కావ॥ భావజారినుత నావిజ్ఞాపన సావధానమతితో వినవైతివి ॥కావ॥ కోమలాంగ భక్తార్తివిదూరా । కామజనక ముల్కల్లి కపినుతా ॥కావ॥

(కనులు నులుముకొనుచు) యింకను భక్తజనులు నిద్రించుచునే యున్నవారు (యిటునటుజూచి) ప్రేయసీ దివాఙ్ మీరలు నిద్రమాని యింకను భజనానంద నిమగ్న మానసులై యుంటిరా.

దివాఙ్॥ మైతో డా నీంద్ గయె. యేసాధ్వి శిరోమణి అబ్ తక్ భజఙ్ కర్కే కాలయాపఙ్ కర్రహీహాయి.

దామా॥ గుణా పాండుగంగణియందు నాకన్న నీకెక్కుడు భక్తి గల్గినందులకు నా భాగ్యము వర్ణనీయము (నిదానించిచూచి) యీరేయియంతయు నిర్నిద్రురాలవై భజనయొనర్చుట కతన శరత్కాల రాకాసుధాకలుని ననఘడింపజాలు నీముఖము వికాసి హీనమై గాన్పించుచున్నది. యింక కొంతరాత్రిగలదు పరుండుము శ్రమగానుండవచ్చును.

గుణా॥ (తలవంచి) నాకేమి శ్రమలేదుగాని.

దామా॥ కానియని యూరకుంటివేమి పైసంగతి వివరించుము. కనుగొన నేడేలకో నీభావము విచారాక్రాంతమగునటుల గన్పట్టుచున్నది కారణము.

గుణా॥ నాథా నావిచారమునకు మేరిలేదు. అదేమన యీదారిద్ర్యమున కించుకేని యు చింతించను యీాకటిక యుపవాసములకు గలంగనుగాని,

పుష్పలతిక్ రాగ్ – రూపకము.

జీవితేశ్వరా । మీకేమిదెల్పుదో ॥జీవి॥ ధావంతముగల్గెను సంతానములేకనునిష్ఫల జీవిత మయ్యెనటంచును చింతగల్గె భావమునను ॥జీవి॥ వనిలోగాచినచంద్రిక తనయులులేని కుటుంబము । జననాథుడు లేనిపురము । వినమెవ్వర్థ మనెదుపల్కు ॥జీవి॥ భువినివెలయు ముల్కల్లా పవనసుతునినేలిన శ్రీధవునికృపారసము గల్గదయ్యోగదా మనపైనను ॥జీ॥

దామా॥ (నవ్వి) దేవీ యెంతవెర్రిదానవు నాకును అరువదియేడులు నడచుచున్నవి నీకును నలువది ఐదువత్సరములు నడచుచున్నవి యిట్టివయస్సున సంతానము గావలయు నని కోరుట ఎంత తెలివిహీనత యెవ్వరైన విన్న నగరా ఊరకొనుము. యింకొక రహస్యము దెల్పెదను.

ఉ॥ తల్లియుదండ్రియు మిత్రులు । సుతాదులు బంధుజనంబులెల్లశ్రీ
వల్లభుడంచునమ్మిన । శుభంబలరారెడు సౌఖ్యమబ్బువా
రెల్లరు దేహబంధువులె । యెవ్వరికెవ్వరు గారుచేతిలో
బెల్లముమీది యీగలును । బెల్లము పోయిన నిల్వనేర్చునే॥

యీకర్మపుత్రులు శత్రువులుగాక మిత్రులా యనువాక్యము దలంచుము. నిరంతరము వేదాంతశ్రవణ మొనర్చుచు భక్తమండలితో గూడి భజన మొనర్చుచుండినను స్త్రీల సహజగుణమగు చాంచల్యము నిన్ను వీడకున్నది.

గుణా॥ హృదయేశ్వరా.

శా॥ సన్తానంబును గాంచుటేగద । గృహస్థశ్రేణికిన్ ధర్మని
సన్తానాత్ముల కెందునైన శుభముల్ । సౌఖ్యంబులేదంచు శా
స్త్రాక్రాంతజ్ఞులు చెప్పువాక్యములు । వ్యర్థంబౌనె వార్ధిక్యదు
ర్దాన్తఖిన్నత నొందుచున్నతరి । భారంబెరిదో బ్రోవగన్॥

వ॥ మనుజుడవతరించుటము లోకోద్ధరణ మొనర్చు పుత్రుని గాంచుటేగదా. అట్లుగాకున్న భగవంతునిచే కల్పితమగు లోకకల్యాణమునకు భంగము వాటిల్లజేసినవాడు గదా దానిచే స్వామి నిగ్రహమునకు పాత్రుడుగాదా. అది నిజము గాదందురేని.

సీ॥ అదితికశ్యపులు శ్రీహరిపుత్రుడవయ్యు । యవతరించుమటంచు యడుగనేల
వరుణదేవునిభక్తి ప్రార్థించి త్రైశంకు । కొడుకునీయుమటంచు గోరనేల
దశరథరాజు నందనులకై హయమేధ । పుత్రేష్టులనుజేయ బూననేల
సుతునకై పాండుభూపతి కృతాంతునివేడు । మనుచుకుంతినివేడ్కబనుపనేల

గీ॥ జనకభూజాని సుతులకై సవనమేల । జేయబూనెమ్ముకండుండు శివునిగూర్చి
కుమరులనుగాంచ గోరియు ఘోరతపము । సల్పనేటికి పుత్రులు శత్రులెట్లు॥

దివాౙ॥ (తనలోనవ్వుచు) అరేయిత్నాబుద్దా హొగయాయిస్కా బేటాబేటి
హోనాబోల్తె కైసాహోనా అగరు కైసాబీ హోతా క్యాఖాతె. ఖానాకు చావల్
నహీహాయి సోనాకు బోర్యా నహీహాయి ఘరుదేఖో తోదరు హామేషా సూర్యచందరు
దర్శన్ దేతాహై ఎఘురానొంకు ఏక్ సంతాన్ నహీహై (మరలనవ్వుచు) మై నానా
జవాన్ హుం మేరాజోరీ యిత్తా మోటాహై హంకు సంతాన్‌కా యిచ్ఛా నహీహై
ఏక్యాహై వుౙ్క్యాబోల్తె సుంతాహుం.

దామా॥ గుణా పుత్రయను శబ్దమున కర్థమేమి యనుకొంటివి. పు. అనగా నరకము త్ర. యనగ జయించుడము. నరక పుంజమును బాపునదే పుత్రయనబడును. అదియే విజ్ఞానము దానినార్జించిన వాడె సంతానవంతుడు తద్రహితుడే సంతాన హీనుడు వాడే సద్గతులకు దూరుడు. నీవిపరీత కోర్కెల మానుము.

శ్రీరాగము – ఆదితాళము.

యిదేవినుము నాదుమాటలౙ । ముదమునౙ దలపుమా । జగదీశుడె కుమరుడనుచు ॥యి॥
సదమలాంగి యెన్నడునీ స్వాంతంబున లేనికోర్కె । యుదయించగ కారణంబు యూహించగనైతినిమది । ముదమున శ్రీహరికృప సంపూర్ణముగాగల్గుటకై । మదిదలచుమె పావనమున సంచితధర్మముగాదే ॥యి॥

అదియేకాక నీకు ధర్మరహస్య మెరింగించెద వినుము. పూర్వజన్మమునతపంబొనర్చి నేని రాజ్యాధిపత్యము విద్యాదాన మొనర్చినేనియు యీజన్మమున విద్యయు దీపదాన మొనర్చిన సౌందర్యము. కన్యాదానంబొనర్చినేనియు భార్యయు ఫలదానమొనర్చిన సంతానము చేకూరును.

గుణా॥ మీరు ప్రతివాక్యము తత్వమునకు మార్చియే బోధింపుచుందురు.

దామా॥ ప్రపంచమున తత్వముగాని పదార్థము గలదా.

గుణా॥ మీతో ప్రతివాక్యములు లాడుటకు సమర్థురాలనుకాను కాని నాకొక విచారముగలుగుచున్నది దానిని నాచరించిన సంతాన వంతుల మగుదుమేమోయని ఆశ గలుగుచున్నయది.

పరజురాగము – ఆదితాళము.

దీనలోక కల్పద్రుమమైన పాండురంగనిదరి । మానసమలరంగస్తుత్య మాచరించి చేమోడ్చియు । సూనులనొసగియు సత్కృపజూపి బ్రోవుమనిసం । తానవంతులగుదుము మన తాపమెల్లబాసిపోవు ॥యిదె॥

దామా॥ (తనలో) హరిహరి స్త్రీలెంత విద్యావంతులయిన అల్ప కోరికలనే కోరుచుందురు నిరవధిక సౌఖ్యదాయకుండగు శ్రీపాండురంగని యీ పాడు నోటితో దేవా పుత్రుల యొసంగుమాయని యెట్లు ప్రార్థించవలయును. (ప్రకాశముగా)

మోహన రాగము – ఆదితాళము.

యెంతమాటలాటితే యిసుమంత విచారములేకను । కంతుజనకు నిట్టికోర్కెకై ప్రార్థించగవలెనా । సంతతినాకేల సతము సర్వము నాశ్రీరంగడె । వంతబాపు ముల్కల్లావారయో తనూజుని సాక్షిగ ॥యి॥

బేలా నీయంత యజ్ఞానురాలను ఎందుగాంచనైతిని.

క॥ నిరుపమ సుధలొల్కెడిశ్రీ । హరిపద రాజీవయుగళి । మందునమదిభా
స్వరతన్ నిలిపినవాడే । వరముల భావంబునందు వాంఛింపడుగా॥

అది యెట్లంటివేని.

సీ॥ సార్వభౌమత్వంబు నిర్వహించెడువాడు । జనవేడ్క పడునెలం చాలనీడ్వ
షడ్రసయుక్త భోజనమొనర్చెడివాడు । కోరునేమజిజొన్న కూడుదినగ
మేలిమి హొగముల్ మేనదాల్చెడివాడు । కాంతుసేయగలండె కంచునగల
సుమతల్పములయందు సుఖనిద్రగొనువాడు । తలచునేకటికి నేలలపరుండ
గీ॥ చంద్రకాంతోత్పలాన్విత సౌధములను । దవిలివిహరించువాడు దుర్దాంతభయద
కాననంబున దిరుగాడ మానసమున । దలచునే తెలియజాలక బలికినావు॥

మానవులకు యీషణముల యందించుక యభిలాష లేకయుండుట భద్రము నిష్పక్షపాత బుద్ధిగలదానవై నీవే విచారింపుము పుత్రులవలన గలుగు కష్టములను.

చ॥ తనయులు లేరటంచుమది । తల్లడమందుట కల్గినంత పా
యనిబలు రోగముల్ గలుగు నంచునిరంతర చింతపిమ్మటన్
వినయ గుణాన్వితుండగునొ । వెంగలియేయగు నోయటంచునిన్
మనమున చింతగూర్చెడి । సమర్థులు పుత్రులు శత్రువర్గమే॥

(ఆలకించి) అదుగో అటువినుము.

మ॥ ప్రణయక్రోధ మనస్కులై యడరు । భార్యాభర్తలన్ గూర్చ బ్రా
హ్మణులన్ స్నానము లాడమేల్కొలుప । విద్యార్థి స్సమాజంబునై
పుణిపాఠంబుల వల్లెలేయు యదనున్ । బోధింప ముమ్మారుభీ
షణకంఠధ్వని తామ్రచూడలు । విరాజద్వాక్యముల్ బల్కెడున్॥

వ॥ యికజాగుసేయక చంద్రభాగ తీరమునకు స్నానమొనర్చుటకై యరుగుదును (భక్తులనుగాంచి) అన్నలారా తెల్లవార వచ్చుచున్నయది మేలుకొనుడు.

భక్తు॥ (మేలుకొని) దామాజిగారు ప్రణతులు నమస్కరింతురు

దామా॥ (మరల నమస్కరించి) చంద్రభాగ తీరమునకు స్నానమొనర్చుటకు పోవుదమా.

భక్తు॥ చిత్తము.

దామా॥ దివాకర్ నీవువచ్చేదవా.

దివాక॥ చెలియా.

దామా॥ మాల్కౌస్‌రాగము - ఆదితాళము.

మనవివినుశ్రీకరా । భవహర ॥మన॥ నినువిస్మృతిని నాఘనపరితాపము కనవైతివి నాకర్మమదేకో ॥మన॥ దీనులపాలిటి దిక్కునీవేయని మానసమున నమ్మితిశ్రీరమణా ॥మన॥ కనకవసన ముల్కుల్ల సమీరణ । తనయవినుత పావన చరితానా ॥నా॥

(అందరు నిష్క్రమింతురు.)

---

# తృతీయరంగము

## పాండురంగ దేవాలయము.

(పాండురంగస్వామి రుక్మాబాయి ప్రవేశము)

పాండు॥ (తనలో) మేదినీభారము మాన్పుటకై నేనవతరించి శుక వామదేవాదుల యంశమున జయదేవాదుల జనింపజేసి లోకమున వారివలన కొంత కర్మజ్ఞాన భక్తులను బోధింపజేసితిని కాని మరికొందరి భక్తుల జనింప జేయవలయునని కుతూహల మొదవుచున్నది ప్రస్తుతము.

గీ॥ అస్మదీయపదాబ్జ నిష్యందమధుర । మహితమకరంద రసపాన మత్తచిత్తు
డైనయుద్ధవు భూమిపై యవతరింప । జేసి లోకోపకారంబు జేయవలయు॥

రుక్మా॥ మోహనరాగము - ఆదితాళము.

ప్రాణనాథ నేడేమివిచారము । భావమందు జేయుచున్నవారలు । మాననీయ నేనదివిన దలచిన దానకృపామతితో నెరిగింపుము ॥ సకలలోక సంత్రాణ మొనర్పగ జాలుశక్తి గలిగినట్టిమీరలు అకళంకమతిన్ దలచినట్టికార్యము సమకూరక పోవునెతలపగ ॥ దారువులందున దనరజ్యోతిచందము యీచరాచరంబుల । ఆరూఢిగవ్యాపించియున్న । బ్రంహాండనాధుడవు గావెతలంపగ ॥ వరచరిత్రముల్కుల్ల పావనీ । వరపశోభనాంగ సద్గుణాకర పరమ పురుషముని పూజితాంఘ్రి భూభరణశౌరి లోకమోహనా ॥ప్రా॥

పాం॥ యిందిరా యిపుడు నేదలంచుకార్యము అత్యంత శ్లాఘాపాత్రమైనది.

రుక్మా॥ మీరు దలంచు కార్యములన్నియు శ్లాఘాపాత్రములే । అన్నియు పరోపకార్యములే. అదియేదియో యెరిగించి ధన్యురాలిగా నొనర్పుము.

పాం॥ భక్తవతంసుడగు ఉద్ధవుని భూమిపై యవతరింపజేసి లోకమున కళావిహీనమొందుచున్న జ్ఞానప్రదీపమున తైలమిడ జేయవలయును. కాన వానినెవనికి ప్రసాదింపవలయునని తర్కించుచుంటిని.

రుక్మా॥ మీకార్యమునకింత విచారమా. నిరంతరము యజ్ఞదాన తపో విరాజిత దీక్షా కంకణ బద్ధులగు బ్రాహ్మణోత్తములు లేరా. లోకవరీయత్వము గాంచిన భూపాల కులులేరా. వీరువారననేల వానిని పుట్టించి చక్రధరుడవై నీవే రక్షింప బూన నొరులతో వేరే అవసరమేల.

పాండు॥ వాని పుట్టించి రక్షించుభారము నాదేకాని వానికి సద్గుణాదు లుప దేశించి వానిచే లోకోపకృతి యొనర్చుటకు నొక కారకుడు గావలయుగదా.

రుక్మా॥ కార్యకారణ సమర్థులు మీరేగదా.
పాండు॥ నీవనుమాట నిశ్చయమే.

(తెరలో) దేవాపాండురంగా పాహిమాం పాహిమాం పాహి.

రుక్మా॥ నాథా ఆరవమేమది.
పాండు॥ భక్తారవము.
రుక్మా॥ యెక్కడిది.

పాండు॥ యీగ్రామముననే మేరకులమందుద్భవించినవాడు దామాజి నామ ధేయుడు. పరమైకాంతి సమానయుక్తుడు. మజ్జనంబొనర్చుటకై గృహిణియగు గుణా బాయితో కొందరి భక్త వతంసుల గూడి చంద్రభాగ కరుగుచు పరమభక్తి సమన్వితుం డగుచు భజన మొనర్చుచు నానామమిట్లుచ్చరించెను.

రుక్మా॥ తోడిరాగము - ఆదితాళము.

గరుడగమనశౌరీ । మురారీ ॥గరు॥ పరమపురుష ఆభక్తవతంసుని చరితము సర్వము నెరి గింపుమువర ।గరు॥ తావకీన భక్తాళిగుణంబులు భావితమై యొప్పారుచుండునో ॥గరు॥

పాండు॥

కమలాలయవినుమా । నెరిగించెద ॥కమ॥ ఆమహనీయుని సుమహిత గుణములు । కమల సంభవున కైవశక్యమే ॥కమ॥ భువిని వెలయు ముల్కల్లనిలయూడా । పవనసుతుని సమభక్త వతంసుడు ॥కమ॥

వ॥ అతి దరిద్ర్యము నాతని నావరించియున్నను యించుకేనియు లక్ష్యముసేయక నిరంతరము.

శా॥ స్నానంబుల్ జపకర్మలల్ సలిపి । మత్సాధ్యముల్ జేరిభ
క్తానీకంబుల గూడి మోదమునను । ద్యత్కంఠతల్ బల్కుమ
ద్గానంబ్ కలనైన దుర్జనుల సాం । గత్యంబురల్ బోక బ్రి
హ్మానందాబ్ధిని మగ్నుడైయుడరు । సామాన్యుండె చర్చింపగల్॥

వ॥ అంతియేకాక.

మ॥ పరులన్ యాచన సేయబోడు నుతికిన్ భావంబులో మోదసం
భరితుండౌన్నడు గాడనర్థముల । సంభాషింపగాబోడు యె
వ్వరికైవన్ యపకారమున్ సలుపగా । బోనంజాలడింతైనను
న్నూర కోపంబు దలంచడెన్నడెదలో । జాగ్రత్స్వప్న లందైనగా॥

శత్రుమిత్రుత్వ భేదములంలేక దాంతుడై యేజీవనమునకును హింస యొనర్పక డాంబిక రహిత నిష్ఠాగరిష్ఠ యుపవాసాది తపో విరాజితుడై కోపహవ్యవాహన శిఖి పరంపరల అత్యంత శాంత పీయూష వృష్టి ధారా సందోహముచే శమింపజేసి మత్తీర్థ ప్రసాదో జ్జీవనముచే జీవముల నిలుపుచు వర్తిల్లుచున్నవాడు. అతనిభార్య గుణాబాయి అతని గుణముల నందియున్నది. దాంపత్యమన నాయిరువురిదే అనుకూల దాంపత్యము.

రుక్మా॥ అయ్యా సజ్జనసాంగత్యమేది గలిగించక పోవును.

సీ॥ జాడ్యాంధకార సంచయమెల్ల బోకార్ప । సజ్జనమైత్రి గ్రీష్మాబ్జహితుడు
అన్నృతమత్తైక నిర్వ్యాణంబుగావింప । సత్సంగసురయా పంచాస్యసమితి
విపరీతతర్కవా పపయోరాశి దరియింప । ధార్మికహితము సౌందర్యనావ
కల్మషదుర్వార । కాంతారమునుగాల్ప । సతుర్షహితము వైశ్వానరంబు

గీ॥ సకలసద్గుణ పుంజనిశాంతమైన । సజ్జనులమైత్రినెన్నగ శక్యమగునె
తలచయది సుహృద్వ్యాప దైశికింప । లంబనెడివాక్యము నరర్థకంబునెట్లు॥

వ॥ దేవా వారికేమైన సంతానముగలదా.

పాండు॥ వారనారతము నన్నే సంతానముగా నమ్ముకొని యున్నవారలు. వారికి వేరే సంతాన పరిశ్రమయుండుకు.

రుక్మా॥ స్వామి మీరింతకుముందు ఉద్ధవుని అవతరింప జేసెదమని అంటిరి. వానిని వీరికొసంగిన సమంచితమని తోచుచున్నది.

పాండు॥ (రుక్మాబాయి వీపున చేయితో కొట్టుచు)

కమవాలయా నా ఆలోచన కుపయుక్తమగు మంచిమార్గము గనుపరచితివి యిపుడే నామా యచే ఉద్ధవుని బాలునిగా యొనర్చి వానినొక ముత్తెపు చిప్పయందమర్చి దామాజీగారు గుణాబాయిగారు మజ్జన మొనర్చుచుండ వారికి పైభాగముననే నుండి నీటిదారయందా ముత్తెపుచిప్పనుంచి గుణాబాయి వోడిలో జేరునటు లొనర్చి నాశిశువునువారిచే పెంపించి నేనొనరింప బూనిన పనికై పిమ్మట యాలోచించెద.

రుక్మా॥ యిది పరమ సంతోష కార్యము. (నిష్క్రమింతురు.)

(పాండురంగస్వామి ముత్తెపుచిప్పను చేధరించి ప్రవేశించి తనలో)

భైరవిరాగము – రూపకతాళము.

లోకోద్ధరణార్థముసే యేకార్యంబైజేతు ॥లో॥ ప్రాకటమగు నామాయను పామరులెవ్వారు తెలియరు ॥లో॥ తాకుత్స్థాన్వయమున తొలికాలంబున శ్రీరాముడనై కానన భూమిలోన వలరినాడ సంతసమున ॥లో॥

సీ॥ తొలిపల్కులనుగొని జలధిఁజొచ్చినసోమ । కుని రూపుమాపఁగ వనజమైతి
శరధిలోఁద్రు మందరపర్వతముసెత్తి । సుమనసులను నేల కమఠమైతి
ధాత్రిని చాప చందముఁజుట్టు కనకాక్షు । గూల్చుటకును యజ్ఞ ఘోణినైతి
ప్రహ్లాదునకుపలు బాధగా ర్పెటిస్వర్ణ । కసిపునుగూల్చి సింగంబనైతి

గీ॥ పాకశాసనుఁగెల్చి స్వర్లోకపదము । స్వీకరించు బలీంద్రుని శిక్షసేయ
వామనుడనైతి నృపుల గర్వముహరింప । పరశురాముండనైతి విభ్రాజమతిని॥

నాచరిత్రములన్నియు విచిత్రకరములు దుర్మార్గుల దౌర్మార్గము హరించి నిరంతరము ప్రపంచ కల్యాణము గావించుటయే నాముఖ్యకర్తవ్యము.

(తెరలో) ఆర్తత్రాణ పరాయణా పాండురంగా.

చ॥ అనుపమ తావకీనకరు । ణామృతవార్ధిని స్నానమాడిపా
వనమతులై విరించిముని । వర్యులులోక హితంబు గూర్చుధీ
వనధులునై చెలంగిరి । భవత్కృపగాంచ నిరాశుసాళి దు
ర్జనులుప్రపంచ వంచకులు । జాల్మలటంచని పేరుగాంచరే॥

పాండు॥ (ఆలకించి) అదిగో నాభక్తవతంసుడు స్నానమాడుటకు నదీతీర మరుగు చున్నవారలు. వారలకన్న ముందు నేనరిగెదగాక.

భైరవిరాగము - రూపకము.

పరమభక్త వరుల బ్రోచు భారమునాపైగలదు । చిరతసత్కృప తోడుత నరయువలయు దామాజిని । ధరణివెలయ ముల్కల్ల తరుచగ వరదుడనైనా । కరయగ దుస్సాధ్యకార్య మవనిగలదె యెందైనను ॥పర॥

(నిష్క్రమించును)





# నామదేవ కల్యాణము

## తృతీయాంకము

### (ప్రథమరంగము)

చంద్రభాగ నదీతీరము

దామాజి గుణాబాయి దివాన్ ప్రవేశింతురు

దామా॥ (తనలో) యమన్‌కల్యాణి – ఆదితాళము.

పతితజనావనశీలా ।గోపాల ॥పతి॥ జితకల్మషనీ శ్రీగుణ గణముల్ మతిగలంచ కుతుకా స్పదంబెదళి ॥పతి॥ యిపుడెకృతార్థుని జేయవె కరుణన్ కపటాత్ముడ ముల్కల్లి కపినుతా॥ పతిత॥

(యిటునటుజూచి ప్రకాశముగా) ప్రియా యీప్రత్యూష కాలంబెంతో సుఖాస్పదమై యడరారుచుండెను.

సీ॥ పాంథులు తెలవార వచ్చెనంచని మేలు । గనితోవలనుబట్టి చనుచునుండ్రి
కర్షకుల్ మోటల గట్టివినోదమౌ । పాటలగొంతెత్తి పాడుచుండ్రి
జన్నిగట్టులుస్నాన సంధ్యాజపంబుల । గావింపనదులకు బోవుచుండ్రి
యాలగాపరివారు పాలుపిండుచునుండ । లేగలంబాయని వాగుచుండ్రె
గీ॥ రేయియంతయు యెల్లెడ హాయిగాను । సంచరించిన వనమృగ సంచయంబు
స్వగృహంబుల దాగగ బారుచుండె । పక్షిగణమెల్ల మేల్కాని పలుకుచుండె॥

గుణా॥ నాథా యిందాక విచ్చల విడిగా సంచరించిన జంబుకములు మనకాలి చప్పుడు. వినినంతనే భీతిచే యెట్లు పరుగిడుచున్నవో గాంచుము.

దివాన్॥ (తనలోతొందరచే యిస్కమాగ్కె ఆజాల్ కర్తాహుం (చేతులు చూచుకొని) హాథ్‌మే బందూక్ నహీహై కైసామార్న ఏక్‌లడ్కీబీ నహీహై జానె దేవో.

దామా॥ (తూర్పుదిక్కుగాంచి) అల్లదే సూర్యభగవానుని రాక గనుగొని ప్రాది క్పతీలలామ సముజ్వల అరుణకాంతి సంకలితమగు నీరాజన మొసంగుచున్నది (భక్తుల గాంచి) అయ్యలారా సూర్యోదయకాలము సమీపించినది తొందరచే నడువుడు స్నాన మాచరింపవలయును.

గుణా॥ దిదాక్॥ చిత్తము (నడచి నదీతీరముజేరి)

దామా। (నదీతీరముజేరి) దేవీ యీనదీతీర మెంత మనోహరముగా నున్నదో కనుగొనుము.

బీన్‌ఫలాస్‌రాగము — ఆదితాళము.

కనుమా। పరమాదరము సుఖాస్పదము। కుతూహలము ॥కను॥ వినూతయోగ్యమై వెలయుచుండె పావనము సదా శోభనాస్పదంబగు ।కను॥

గుణా॥ విమలసైకతస్థలములు ఫలసుమ సమయుతమై యీ ఆరామవృక్షములు । ప్రబంధంబును జేకూర్చును మదికిని రాజితమై యలరారుచుండెను ॥క॥

వ॥ అత్యంత నిర్మల జలతరంగములచే భాసిల్లు ప్రవాహమున తమప్రియురాండ్ర తోగూడి మృణాళ నాళంబుల కడుపార భక్షించి మృదుమధుర సంభాషణ మొనర్చుచు యీవలిగట్టునుండి ఆవలిగట్టునకు. మరల ఆవలిగట్టునుండి యీవలి గట్టువరకు విలాసముగ యీదులాడు రాయంచపిండు కనులపండు వొనర్చుచుండెను.

దామా॥ అల్లదే నల్లకానుగు చెట్టులగాంచి ప్రావృట్కాల జీమూతమను భ్రాంతిచే తమ పింఛముల విప్పి నాట్యమొనరించు బర్హి సముదము గాంచుము.

కీర్తన పైచరణము.

యిలను వెలయు మల్లి పోరివర నిలయుడైన కపివరుడు సతతము । అరుచుండు బృందావన సమమై వెలయుచుండె క్ష్మాలంకారముగా ॥కను॥

గుణా॥ నాథా యీసీమ దిలకింపుడు.

సీ॥ ఘ్రాణేంద్రియంబుల గారవించెడిసౌర । భాయితసూన సంపంగితరులు
శ్రవణంబులందమృత రసమొల్కునటుజేయు కలకలయని పల్కు చిలుకపిండు
కుసుమమరందంబు గ్రోలిమత్తెక్కియు । ఝునకారములుజేయు షట్పదములు
పచ్చవిల్తుండాడు రచ్చలమరపించు । పల్లవయుత మల్లె మొల్లపొదలు
గీ॥ లేతపచ్చికదిని తలలెత్తిదిశలు । గాంచుచును వేడ్కతోడుత గంతులిడెడు
హరిణపోతంబులను గాంచపరమయోగి । గణము కైనను కుతుకంబు గలుగకున్నె॥

గుణా॥ నాథా యీచంద్రభాగ తరంగిణి నాస్వాంతమున కెంతయో సంతసము గూర్చుచున్నది.

సీ॥ నిర్మలతుంగోర్మి నీకంబు దృక్కాల। ములకంచిప్రీతి గొలుపుచుండె
కారండవక్రౌంచ కలహంస నివదంబు। కర్ణపర్వంబులై గ్రాలుచుండె

పిల్లతెమ్మెర మెల్ల మెల్లన పైసోకి । తనువుల పరవశత్వంబుజేసె
వీచిసీకరసంఘ వృష్టియు వడనగ । వ్వారముల నభిషేక మాచరించె

గీ॥ స్నానమాడియు సైకత స్థలములందు । చాత్రులలుగూడి సావిత్రిజప మొనర్చు
బ్రాహ్మణోత్తమ ప్రతతి సస్వార శుభద । మగుచు నొప్పారెనిమ్నగాసాగసుభగరో॥

వ॥ అభూసురులు తమ సంధ్యావందన తామ్రమయపాత్రల తింత్రిణీ ఫలరసమున బాగుగా శుద్ధియొనర్చుట కతనయెట్లు తళతళయని మెరయుచున్నవో గాంచుడు (యిటునటు జూచి) ప్రియా భగవనిర్మితమగు ప్రకృతి చిత్రము కడు శోచనీయము. కొంతకాల మొకరికి సంతోషము వేరొకరికి అత్యంత దుఃఖము యిందులకు యిదియే తార్కాణము.

ఉ॥ కైరవ కాంతలెల్లనిజ । కాంతునిదీనముఖంబు గాంచివి
స్తారవిషాద సంభరిత స్వాంతములన్ నవమందహాసమొ
ప్పారెడుమోము వెల్వెలగ బారుచునుండె కుశేశయాంగనా
వారము నాధునిన్గచెడి । భాగ్యముగల్గు నటంచు నెంచెడున్॥

(మరొకదిక్కుగని) శీతకిరణ సంబంధమగు హిమంబీచెట్లపైన వ్యాపించి ముత్తియముల యట్లు విరాజిల్లుచున్నవి. అటుగనుడు. ప్రపుల్ల కుసుమ సంచయముల గారవించ నెంచి మందముగా పవను డరుదెంచి వాటిని దాకుటచే నేలపై నెట్లు తత్సుమంబులు రాలుచున్నవి.

దామా॥ (తూర్పుదిక్కుగాంచి) హృదయేశ్వరి భక్తవతంసులార.

చ॥ తొలిదెసనాతి మోముపయి । దోచెడి కుంకుమ బొట్టురీతిస
ల్లలితముగా వెలింగెశుభ । లక్షణపశ్చిమ దిక్సతీమణీ
విలసిత వక్త్రమున్గనగ । వేడ్కచెనిల్పిన దర్పణంబుగా
జలజహితుండుదోచెయిక । స్నానమొనర్పుడు జారుసేయకన్

దివాన్॥ (తనలో) అరేబాపురే బోహత్ సంకట్ ఆయా (వణకుచు) కైసాస్నాన్ కర్నా పానీ బిల్కుల్ ఠండా హై ఐసా హర్రోజు ఏత్తానుబోమె మజ్జన్ కరేతో జోరీ కీదూర్ హోజాతాహుం.

దామా॥ దివాన్ యింక ఏల ఆలసించెదవు.

దివాన్॥ శీతబాధ్ బోహత్ హై దేఖో దంతోంకి జగడ్ కైసాహోరహాహై యిత్నా ఠండా పానీమె స్నాన్ కరేతో శీతబాధ్సె పరేషాన్ హోకర్ ఏక్ రోజ్ మే దివాన్ హోజాతాహుం.

దామా॥ అట్లయిన మంచిదే నీపేరునకు సార్థకము గలుగును. నీయిచ్చకములుమాని స్నానమొనర్చుము.

దివాన్॥ అచ్ఛా తుమ్హారే హుకుం (అని నీటిలోదిగి వణకును)

దామా॥ సుణా॥ (నీటిలో దిగి చేతులు జోడించి)
దేవా పాండురంగా రుక్మిణీమోహా హృత్సరసిజ ప్రభాత విరాజమాన సప్తాశ్వ.

శా॥ పాపౌఘంబుల దూరముఁ బనుపు । శుంభచ్ఛక్తి గైకొన్న నీ
శ్రీపాదప్రభతాపగా సమము వా । సింగాంచు నీయేరుమా
తాపంబుఁ హరియించి నెఁ గొలువగా । ధన్యాత్ములఁ జేసిమో
క్షాపేక్షఁ గలిగించుగాత జగదీశా । పాండురంగప్రభూ॥

దామా॥ శ్యామకల్యాణి రాగము – ఆదితాళము.

శ్రితజనబంధో । సేవ్యపదాంబుజ ॥శ్రి॥ శతపత్రోద్భవ సన్నుతచరణా । శతముఖ రిపుభంజన మాధవహే ॥శ్రి॥
రాధామానస రంజితభవహర । మాధుర్యమునీ మహిమలు గనగఁ ॥శ్రిత॥ ప్రేమ్రవేలసిన ముల్కాల్ల పురీశ్వర । పావనినుత పదపంకజ సంతత ॥శ్రిత॥
(వేరొక ప్రక్కన పాండురంగస్వామి ముత్తెపు చిప్పతో ప్రవేశము)

పాండు॥ బిలహరి రాగము – ఏకతాళము.

మంచిసమయ మిదియేగావించెద నాకార్యంబును ॥మంచి॥ అంచిత గతి స్నానమాచరించుచుండె గృహిణితోడ । చరిచద్గతి మెరయుశుక్తి సంపుటంబు విడతునదిని ॥మంచి॥ దారుణిముల్కా పౌరి తరుచరు నేలిన చందము । వీరిని రక్షించునట్టి భారము నాపైగలదు॥మం॥
వ॥ ప్రవాహమున యీ సంపుటమందు గల్గు బాలునకే యపాయము గల్గకుండ నరయువలయును (నీటిధారలో ముత్తెపుచిప్పనుంచి నిదానించి చూచుచు) యాముత్తెపు చిప్పను ప్రవాహము మార్జాలకి శోరన్యాయముగా గొనిపోవుచుండెను.

గీ॥ భక్తకోటికి రగమెల్ల వశ్యమగుచు । అడరుచుండును దుష్టుల యెడలసర్వ
జంతువులుగాంచు శాత్రవ సంఘమట్లు । సజ్జనుల కెందులోటు కాసంతగలదే॥

దామా॥ (చేతులు జోడించి) నిర్మల జల పరిపూరితవగు నోతరంగిణీ.

మ॥ కరపాదోతర వాగ్మనంబులచెనే । గావించు పాపంబులఁ
పరిహారార్థము రుక్మిణీవిభుని । దివ్యాఙ్ఘ్రిఁ ప్రమోదంబుచే
శిరమందుఁ ధరియించి నిర్మలగతిఁ । చెన్నొందు నీగర్భపు
ష్కరస్నానంబొనరించుచుంటినను వీకఁ ధన్యునిఁ జేయవే॥
(స్నానము సేయును)

దివా॥ (తనలో) హంసు మంతర్‌గింతర్ నిహీహై యేభక్తశిఖామణ్ కైసా మంత్రోచ్చారణ్‌కర్ రహాహై హంతవ్యోంకి సమాఁ స్నాఁకర్న. హంసు కోః పూచ్‌తే దామాజిగారిచూచి] బోహాత్ దిల్‌సె అపునే విశ్వాస్‌కరే హంసు ఏక్ మంత్రోపదేశబీ నహీంకరే బిచారే అద్మికు కోఁ పూఛ్‌తా.
దామా॥ వెర్రివాడ పాండురంగని నామమంత్రమునకన్న ఘనమగు మంత్రము వేరే కలదా.

దివా॥ అచ్ఛా భగవాన్‌ను యాదికర్కె స్నాన్‌కర్తాహుం యిజాయత్ బేనా చాయియే.

దామా॥ మంచిది ఆల్లే కావింపుము.

(దివాన్ దామాజి గుణాబాయి స్నానమొదర్చుచుండ ముత్తెపుచిప్ప గుణాబాయి వొడి లోనికి వచ్చును)

గుణా॥ (చేతదీసుకొని) యిదియేయాశ్చర్యము స్నాన మొనర్చగ ప్రవాహమున గొట్టుకొనివచ్చి యిదియేమిదో నాయొడి ందు చేరినది దీని పరిక్షింపుడు.

దామా॥ చూచి తీసుకొని ప్రియా యిది ముత్తెపుచిప్ప దీనియందు వెలలేని ముత్తియము లుండును. అవిప్ప బాలువిగాంచి ఆశ్చర్యమున ముత్తెపు చిప్పయందు ముత్యములుండునుకాని బాలులుందురని కనివిని యెరుంగను యిదియంతయు యీశ్వర తంత్రముగనే తోచుచున్నయది. లేక దీనియందు బాలకుడుండుట కడు శోచనీయమే.

గుణా॥ దీనియందు పసివాడుండుట యాశ్చర్యమైనదే యిట్లుండుటకు కారణమూహింపుము.

దామా॥ (విచారించి తలయూచుచు) యిదియొక అత్యాశ్చర్యమగు విషయము కాదు. యేదోయొక కారణముచే మహాత్ముల రేతస్రావమగునేని దానిని వృక్షపయపకనే దైన యొకదానియంచిన నది వమోఘశక్తి సమన్వితపదార్థమగుటచే మహా పురుషుల యంశమున లోకోద్ధరణార్థము అయోనిసంభవులై విరాజిల్లుదురు.

గుణా॥ మీరానతిచ్చిన విషయము నాకనుమానాస్పదముగనే గోచరించుచున్నది. యిదివరకిట్లెన్నడైన జరిగినవా.

దామా॥ వెర్రిదాన మహాత్ముల జన్మచరిత్రములు కడువిచిత్రాస్పదములు.

సీ॥ కురుపాండవులకెల్ల గురువైన ద్రోణుండు । ఘటమందుజన్మించి గ్రాలెగాదె
నిర్జరసేనాధి నేతషాణ్మాతురుం । డవతరించెను శరమందుగాదె
చిరకాలజీవియై చెలగుకృపాచార్య । వరుడుగెల్లునబుట్టి వరలెగాదె
ద్రుపదుని బోట్టైన శ్రేలియందునబుట్టి । ద్రుపదుండు మహితపేరొందెగాదె
గీ॥ యిట్టివారల చరితంబు లెన్నియేని । గలవుధర్మంబు స్థాపించ దలచిపుణ్య
పురుషులు తమంతనేతాము బుట్టుచుంద్రు । యింతయేటికి మనభాగ్య మెన్నవశమె॥

పాం॥ (తనలో) నేనరుదెంచిన కార్యము ఫలించినది యికముందు జరుగు కార్యముల గురించి విచారించెదగాక. (నిష్క్రమించును)

గుణా॥ (తనలో) నిన్నరేయి నేదుఃఖించిన విషయము భగవానుడగు పాండురంగడెరింగి మాకు పుత్రదానం బొసంగెననియే తోచుచున్నయది. యేమి మాభాగ్యము వర్ణనాతీతమె.

శ్రీరాగము – రూపకతాళము.

ధన్యమయ్యె నాదుతనువుహా ॥ధ॥ పుణ్యదినము నేడుతలపగ ॥ధ॥ సంతసంబుగల్గెను మత్స్యాంతంబున యీబాలుని । సంతానంబుగదలచియు సాకుదు కడుజాగ్రతతో ॥ధ॥

భూవెలసిన ముల్కుల్లాపావని వరదులి సత్కృపచే వరియ మొదవెను । మాచిత్తము రంజిల్లెనుకడు ॥ధ॥

దామా॥ ప్రేయసీ యీబాలుని రూపురేఖా విలాసాదులు పరీక్షించ యొక మహాపురుషుని యంశమున యవతరించిన వానిగా దోచుచున్నది. వీనిని మహాజాగ్రతతోపోషించవలయును. (అని బాలుని చేతికండిచ్చి చిరునవ్వుచె) రాత్రి సంతానము లేదని మిక్కిలి వగచితివి వీనినే స్వగర్భ సంతానముగానెంచి నీసంతాపము మానుము.

గుణా॥ (బాలుని నిదానించి చూచుచు)

దివాణ॥ మేరేకు బేటాబేటి నహీహై మేరాబీబీ అజీ స్నాన్ కర్కేకుఆయెతో హాంకు ఏక్ బాలక్ మిల్తెహా మైస్నానార్థ అనేకబాంద్ ఘరుకుజాకర్ జోరీ అజ్ పర్వదిన్ హై చంద్రభాగ నదీకు మజ్జణ కర్కేకు ఆవో బోలె. యేబాత్ సున్‌కర్ క్రోధ సంకుచిత్ హోకర్ బీస్‌పచ్చీస్ మార్‌కర్ ఏత్తా సుబోమె పాని బోహాత్ ఠండా రహితా. మజ్జణ కరేతో మాబాపుకీ దూరు హోజాతా తుజావో మై నహీ ఆతాహుం బోల్కె గర్దణ పకడ్కె బహరు నికాల్ దియె. యేసాబ్ విచారుకరేతో మేరాపురా కృత్ పాపహై॥

దామా॥ గుణాబాయిని యట్లే నిదానించి చూచుచుంటివేమి.

గుణా॥ యీబాలుని రూపురేఖా విలాసముల గాంచిన కొలది గాంచ వేడుక యగుచున్నది. యీబాలుని రూపురేఖా విలాసముల గాంచినకొలది గాంచ వేడుక యగుచున్నది. యీబాలుని సౌందర్య మేమనవచ్చును.

సీ॥ శారద రాకావిహారకై రవహితుణ । బోలికాంతినిగుల్కు ముద్దుమోము
సంపుల్ల సారస సమమయ్యె వెడదలై । కమనీయమైయొప్పు కన్నుదోయి
శంపాలతలతోడ సరిబోలి కనులకు । మిరుమిట్లు గొల్పెడి మేనుకాంతి
శ్రీకారములవలె చెన్నొందె మహితమై । జాడవింతనుగొల్పె శ్రుతియుగంబు

గీ॥ కమఠములబోలు నట్టిమీగాళ్ళపేద । తనుకు జూపెడి నడుముకం దర్పబాణ
ములనుబోలిన కనుబొమల్ ముత్తియముల । తీవినొప్పారు నఖములుగావె చూడ॥

గుణా॥ ముఖ్యము అఘనాఘతముగా మనకిందు యీబాలుడు లభించుట దీనుల షాలిటి పెన్నిధియగు పాండురంగని కృపాలిటాక్షమదప్ప వేరొండు కారణములేదు.

దామా॥ ఔనుసఖీ జాగుసేయక శ్రీపాండురంగస్వామి కోవెల కరిగి తీర్థప్రసాదముల స్వీకరించి యీబాలునకు అటనే పెద్దలచే నామకరణమొనర్చవలయును. పోవుదము పదు.

గుణా॥ చిత్తము.

నామా॥ దివాణ నడువుము.

దివాణ॥ (నడచుచు) ఆజ్ సుదిన్ హై ఆపుకు ధర్మసంతాణ హువా. హాంకు బోహాత్ ఖుషీఆయా, సాబ్ భగవాణ్‌కా కృపాహై.

దామా॥ అఠాణరాగము – ఆదితాళము.

వాచామ గోచరత్వమే – త్స్మాజన్మస్థితిలయకారకు డగుకమలేక్షుని చరితావినోదములు॥
వాచా॥ రాచకన్యకల పదియార్వేవుల నీచమనక చెరనుబెట్టు నరకుని । నేచిపరిణయంబు
వారల గాచినాడు గోపాలబాలుడై ॥వాచా॥
సరసిజాసనుండుద్భవించి విస్ఫురితతత్వ మరయగోరియును । తత్పర జనాళమునజొచ్చి
పెక్కువత్సరముల రసినాద్యంత రహితుడనె ॥వాచా॥
శితిగళుండు వనజోద్భవుని సంతతులు శరధి సూర్యచంద్రగ్రహములు క్షితిసర్వము
నాపరేశు దృష్టిలో క్రిములుగదా ముల్కల్లి కపివినుతు ॥వాచా॥

(అందరు నిష్క్రమింతురు)

—— —— ——

## ద్వితీయరంగము.

### దామాజిగారి గృహము.

తొట్టెలో పిల్లవాడు వుండును దామాజిగారు కూర్చుండియుండ
యవనిక ఎత్తబడును.

దామా॥ మోహనరాగము ఆదితాళము.

నీమహిమలుగనగా । తరమా ॥నీ॥ శ్యామసుందరా కోమలపదయుగ కామిత శ్రితసంఘాత
ప్రదాహారి ॥నీ॥ నీవాత్సల్య గుణంబులేమచు । భావింతును లక్ష్మీవల్లభహారి ॥నీ॥ ముల్కల్లి
పురీ కపివరదా । ఫుల్లసరోజసము జ్వలనయనా ॥నీ॥

మహామహులకైన యిదమిద్ధమని నిర్ణయించరాని భవదీయ విచిత్ర గంభీర లీలార్ణవమేమని వర్ణించువాడ నిరంతరము సుధారసముకన్న సహస్రగుణాధిక్యముగలదై పరమపావనమగు భవదీయ శ్రీపాదతీర్థముగ్రోలి యుష్మదుచ్ఛిష్ట శేషప్రసాదము గ్రహించి క్షుత్పిపాసాదులను మాటయెరుగక నీనామాను సంధానమొనర్చుచు మాయాంభోనిధి కర్ణధారులగు నీభక్త జనులతోగూడి శాంతరస మొలుకు నీ నామకీర్తనలు బాడుచు సంతోష పారావార వీచీ పరంపరల దేలియాడ నీక స్నానమాడుతేరి ప్రవాహమున యీ బాలును మాకడ కంపించి లేనిపోని బంధమేల గల్పించితివి ఎన్నడైన చేజాచి స్వామినాకు సంతానమొసంగుమని యాచించితినా. స్వప్నమందైన సంతాన మనుమాట దలంచితినా. ఎందరో భాగ్యవంతులు సంతతికై పలుపాట్లు బడుచురు అల్లాడుచుండ వారికొసంగక నిర్భాగ్య దామోదరుడనగు నాకీగోల యెందుకొనగూర్చితివి. (విచారించి) పుట్టు గొడ్డువారలమగు మాకీ శిశుపోషణ విధానము అంధేండు న్యాయముగదా. శిశుపోషణ సామాన్యమా.

సీ॥ తలకంటిపాలిచ్చి జలకంబులాడించి । కడుజాగరూకత గావవలయు
పగలు సంధ్యలయందు బాలగ్రహాదులు । జేరకుకడంగ వీక్షించవలయు
మశకపిపీలికల్ మక్షికాదులబాధ । లేకుండ శ్రద్ధతో సాకవలయు
డొరలి టోలింకనుండి ధరణిపైబడకుండ । రెప్పవ్రాల్పకచూచుటొప్పవలయు
గీ॥ వ్యాధులేవియురాకుండ వైద్యవరుల । జేరియౌషధములను యాచించవలయు
మంచిమాటలు నేర్పి నిర్మలప్రవృత్తి । నేర్పవలయును యిదిపెద్ద నియతిగాదే॥

అపిమ్మట వారికి మంచివిద్యావిధానము నేర్పి ప్రస్తుతకార్య ప్రవర్తనలయందు జొరనీక కర్మజ్ఞాన భక్తులయందభిమాన మేర్పరచి మానవులకు సహజధర్మమగు ప్రపంచసేవయందు మిక్కిలి రుచిగలిగించి ఆ కార్యమొనరించు సామర్థ్యనిగా యొనర్చ వలయును. అపుడు గదా తలిదండ్రులకు కొడుకుల గన్నందులకు ఫలము. విచారించిన యింకెన్నియో గలవు (విచారించి) యేమినా వెర్రితనము లేనిపోని యూహాలను తండోపతండముగా గల్పించు కొనవేల.

చ॥ వనజభవాండ సంతతిక్రి । పామతికంటికి రెప్పగాచురీ
తినిమనుపన్ కరంబున ప్ర । దీపితకంకణ మున్ ధరించుశో
భనుడగు పాండురంగనిదె । భారమునుండగ కొంచగాండ్రుయా
మనుజులు బ్రోవబూనినను । మానిన నొక్కటె యెంచిచూడగన్॥

నిక్కముగా నాపాండురంగణి సంపూర్ణానుగ్రహము యీ బాలునిపై యున్నట్లేయున్నది లేకున్న స్వామి అర్చకావేశమై అపుడు యీబాలునకు నామదేవని నామకరణంబేల యొనర్చును. నిజముగా విచారించిన యీబాలుడు సామాన్యుడుగాడు పూర్వమున యీతడే మహా భాగవతోత్తముడో యిపుడీ లోకమంత అజ్ఞానావృతమగుట గాంచి జనులకు కర్మజ్ఞానభక్తుల బోధించ భగవానుని యానతిచే జనించెగాలోలు లేకున్న (ఆశ్చర్యమున) యింతపసిపాకడేమి ముత్తెవు చిప్పయందుంట యేమి తుంగతరంగ మాలాన్వితహా ప్రవాహమున స్నానమాడు మాకడకు వచ్చుటయేమి. ఇదియంతయు శోచనీయము (ఇంచుక విచారించి) యెన్నిసుందరమగు నవీన వస్తువులగాంచినను ఎందరినో పసిపాపలను వీక్షించిన యించుకింతయు చలించని నామనంబేటికో యీబాలుని చూచినంతనే నానందరస ప్రవాహముప్పొంగి పాండురంగణి స్మరణము నైతము మరపించును. పూర్వముధర్మత్రాణ మొనర్చ యవతరించిన శ్రీకృష్ణ భగవానుని పోషించిన యశోదనందాములుధన్యాత్ములగు చందమున యీనామదేవు హస్తస్పర్శ పాద శరీర స్పర్శనాదులచె ధన్యాత్ముడనయ్యెద శ్రీరామా విభో పాండురంగా.

బేహాగ్ రాగము - ఆదితాళము.

నీకృపగనుగొనగా । తరమా ॥నీ॥ శ్రీకంఠాదిమునీంద్రులకైనా ॥నీ॥ ప్రాకటులగునీ భక్తులపైకు । శ్లోకుడవై జూపుచుందువరయగ ॥నీ॥ యీపసిపాపని యిచ్చిమమ్మలను । గాపాడుటకై కంకణ మూనిన ॥నీ॥ కనకచేల ముల్కుల్ల సమీరణ । తనయులపైనను దనరుచుం

దువరయగ ॥నీ॥ యీపసిపాపని యిచ్చిమమ్ములను గాపాడుటకై కంకణమూనిన ॥నీ॥ కనక చేల నుల్కొల్లసమీరణ । తనయులపైనను దవరుచుండునీ ॥నీకృ॥

దివాన్॥ (ప్రవేశించి) మహాత్మా నమస్కార్.

దామా॥ భోజనమొనర్చి యిపుడే వచ్చెదనని జని చాలా తడవొనర్చి యరుదెంచితి వేమి.

దివాన్॥ క్యాబోల్‌నా మేరాహిజ్జత్ చెలీజాతి జబ్ భగవాన్‌కు తీర్థ ప్రసాద లేకర్ ఆపుకా ఆజ్ఞలేకరు మకాన్‌కు గయేదా హాంకు దేఖుకరు దండతాడిత భుజంగోకిం సమాన్ క్రోధచిత్తహోకరు మేరా జోరీ బోహత్ మారుకరు ఖానాగీనా కుఛ్ నహీహై జావో తుందరు హమేషా భగవాన్‌కు భజన్‌కర్కే ఖేలేతో కైసా సంసారు గుజర్నా తుముస్లింహోకరు పంచవక్తు నవాజు చోడ్కే హిందుదేవల్‌కు కైసా పూజాపాట్ కరు రహాధా దేఖో ఆజ్‌సే హరిభజన్ చోడ్డో నహీతో తుమార చడ్మానికాల్ తాహుం బోలె. (అటునిటుజూచి) అచ్చా హిందు ముసల్మానోంకి దేవలు హాలాయిదాహై యా ఏక్‌హై.

దామా॥ (నవ్వి) ఓయీ పిచ్చివాడా యిద్దరుకాని ముగ్గురుకాని అనేకులుగాని భగవంతులుందురా. భగవత్తత్వ మొక్కటియే. ఆచారములు వేరు. హిందువులు భగవంతునకు అనేక దివ్యనామము లొసంగి,

శా॥ శాంతాత్ముండు కిరీటకుండలుడుభా । స్వత్స్వర్ణ చేలుండు శ్రీ
కాంతావృత్పద పత్ర భాస్కరుడు సా । కారుండు కందర్పభా
స్వంతుండంచని విగ్రహంబులను శాస్త్రప్రక్రియన్ జేసిరా
ధ్వాంతస్వాంతత పూజలన్ సిలిపి । ముక్తశ్రేణులై యొప్పెడిన్॥

మహమ్మదీయులు నిర్గుణుడు నిరంజనుడు నిరాకారుడు అల్లాయని ఖుదాయని ఉపాసింతురు యీమతములన్నియు మంచివె. అన్నియు అహింతత్వములే ఆ మతధర్మములన్నియు ఆరోగ్య దాయకములె మతమనగనేమిదో మొదట గ్రహించవలయును ఉత్పత్తిస్థితి లయముల కాదికారణము దృఢపరచు మనోనిశ్చయము మతమనబడును మతస్థాపకులగు వారలెల్లరు (లోకోయంభిన్నరుచిః) గావున మానవులు నాస్తికులు గాకుండుటకయి అనేక మతముల గల్పించిరి. అంతియేకాని వొకమతముపై స్పర్ధచే వేరొకమతము గల్పింప బడలేదు. యేమతమువారైనను భగవంతునకు ప్రియులె యెట్లనిన వీధులనూడ్చి పారిశుద్ధ్య మొనర్చు పాకీవాడును ఏక చత్రాధిపత్యమొనర్చు సార్వభౌముడు భగవద్దృష్టిలో సమానులె. మొత్తము ప్రతిమానవుడు. ఆత్మధర్మము గమనించి ఇంద్రియ నిగ్రహము గల్గి స్వార్థత్యాగియైపరోపకార బుద్ధిగలిగి సర్వం విష్ణుమయం జగతు అనువాక్యము దలంచి అతని అడుగు కొందామరల భజించుచుండిన ముక్తుడగును యిపుడు నీసంశయములు మానినవా.

దివాన్॥ యేబాత్ బిల్కుల్ ఠీక్‌హై ఆజ్ పాంకే వక్తు మేరాఘరుకు ఆకరు వో సతాన్‌సే యేసాబ్ బోల్‌కరు వుమ్కు భగవాన్‌కా భజన్‌పరు మజా దిఖానా. ఐసా కరేతో తుంహీ అల్లాహై.

దామా॥ మంచిద్ది అట్లె యొనర్చెద.

(తొట్లెలోనున్న బాలుఁడు రోదనమొనర్చును)

దామా॥ దివాన్ ఆడోలికనూపుము.

దివా॥ (ఊపుచుండును పిల్లవాఁడు మరింత యేడ్చుచుండును)

దామా॥ బాలుఁడు యేటికో వెక్కి వెక్కి యేడ్చుచున్నాఁడు అపుడు నామకరణ మొనర్చిన పిమ్మట భగవత్సాన్నిధ్యమున త్రాగిన తీర్థప్రసాదము దప్ప వేరే ఆహారమేమి యును లేకుండుటచే ఆకలి యగుచుండ వచ్చును. బిచ్చమనునది స్వప్నమందైన యెరుఁగని గుణాబాయి యింతవరకు తొట్లెను పాత్రికలను బిచ్చమెత్తి మరల నూనె పాలకొరకు తిరుపమున కరిగినది స్త్రీలకు సంతానమనిన యెంతయో ప్రేమ.

మ॥ తినబోనమ్ము ధరించ వస్త్రములు । నిద్రించన్ నికాయంబులే
కనుసన్యాసులరీతి గ్రుమ్మరిన లక్ష్యంబుంచరున్ సంతతిన్
గనకున్నన్ ఘనఖేదమందుబడు । నాగంబట్లు చింతాపయో
ధినిదాటన్ నిపుణత్వమున్ గనరుగా । స్త్రీశబ్ద స్వార్థంబుకై॥

(విచారించి) అట్లుండినను నేకదా లోకకల్యాణము భంగపడక పరివృద్ధి నొందు చున్నది.

గుణా॥ (పాలగిన్నె నూనెపాపుతో ప్రవేశము)

బేహాగురాగము – ఆదితాళము.

పవిత్రురాలనైతిని దలపఁగ ॥పవి॥ అవిరళ సుఖసౌఖ్యము చేకూరెన్ ॥పవి॥ భువిలో నేనొక పూతచరిత్రనై ప్రవిమల కీర్తియు బడయఁగంటినే ॥పవి॥ యిన్నిదినంబుల కిపుడుబాలుని చిన్నముఖము వీక్షించఁగంటినే ॥పవి॥ లాలితమగు ముల్కుల్లకపివినుతు డాలక్ష్మీశునికృపా రసముననను ॥పవి॥

వ॥ (చూచి) బాలుఁడు రోదన మొదర్చుచున్న డెందులకు.

దామా॥ పూరకే అట్లు యేడ్చుచున్నాఁడు. యేంతకు యూరకొనుట లేదు.

గుణా॥ (తొట్లెకడకరిగి బాలునియెత్తుకొని) నాముద్దులయ్యా ఆకొని యేడ్చుచుంటివా (తలచూచి) నాథా అప్పటినుండి తలకంటకుండుటచే మాడనెట్లు తళతళమని మెగురుచున్నదో గనుఁడు (కాళ్లపై గూర్చుండ బెట్టుకొని తలకంటుచు) పూకొనుము నాయనా పూరకొనుము. (పాలుపోసిన పిల్లఁడు క్రక్కును) నాథా యేమి వైపరీత్యము బాలుఁడు రోదన మొనర్చ ఆకలి యనుకొంటిని. ఆకొన్నబాలుఁడు పాలుబోసిన గుర్తిట్టుక్కన మ్రింగుదురుకాలి యిట్లు క్రక్కఁగలరా. (విచారించి) దృష్టిదోషమై యుండునుగదా.

దామా॥ దృష్టిదోషమగునేని అపుడు స్వామి యాలయమునుండి వచ్చువరి కొంత తీర్థప్రసాదము తీసుకొని వచ్చితిని. వాటినుంచుము.

గుణా॥ చిత్తము (బాలునకు తీర్థప్రసాదమ్ములొసఁగును)

దామా॥ (చూచి) దేవీ యేమి యీయద్భుతము యిప్పుడు పాలుబోసిన క్రక్కును భగవత్తీర్థప్రసాదము అమృతోపమానముగా భక్షించెను. యీతఁడు పూర్వమొక మహా

భాగవతోత్తముడు కనుకనే భగవత్సన్నివేదిత పదార్థముల యందే మిక్కిలి రుచి తదితర ములయందయిష్టము నేటినుటడి వీనికి యితర పదార్థము లొసంగక భగవత్తీర్థ ప్రసాద ములే యొసంగుచుండ వలయును. యిక్కడి మనభాగ్యము ఫలించినది తలంచుము.

గుణా॥ చిత్తము (మరల తొట్లెలో పరుండబెట్టి)

జో పా ట.

జోసూనను కుమార జోనామదేవా । గాసిల్లితివ నన్ను గన్నట్టితండ్రీ ॥జోజో॥ భూసలంగీ అనే బోసి తొడగియుందు । కీసాల బబ్బాలు బోసెదనుతండ్రీ ॥జోజో॥ బాలయేడ్వేగవేర లాలాలుగార । జాలిగలిగించెనాస్వాంతంబులోన ॥జోజో॥ ధారుణీ ముల్కల్ల మారుతి ప్రభుడా । శ్రీరామచంద్రుండు కోరినిను బ్రోచు ॥జోజో॥

(బాలుడు రోదన మొనర్చును)

గుణా॥ నాథా మరల యెటికో యేడ్చుచున్నవాడు.

దామా॥ ప్రేయసీ నట్లు వట్టిపాట బాడకుము పాండురంగణి నామసంకీర్తనగావింపుము.

గుణా॥ మోహనరాగం - ఆదితాళము.

పాండురంగ శ్రిత భావకముల మార్తాండ శ్రీరమేశా ॥పాండు॥ అండజగమన వేదండ వినుత భవ । ఖండన వనజాతాండ గర్భ దోర్దండదనుజ జిత్సొండ పరాత్పర ॥పాండు॥

దామా॥వ॥ సఖీ చూడుము మనభాగ్య మేమనవచ్చును. యీబాలునకు యింతలే ప్రాయముననే భగవస్మరణయందింత యిష్టము గలిగినది. నీవిపుడు పాడినపాట చెవికి సోకినంతనే అత్యంత కుతూహల బంధు మనం కములుడై నివాలితాత్ముండై నెట్లు ఆలకించుచున్నడో గనుము.

(బాలుడు మరలయేడ్చును

దామా॥ మల నిప్పటి సంకీర్తనమే పాడుము.

పైకీర్తన చరణము.

మారజనక శృంగారమకుటకేయూరకటకభూషా । చారుచతగిరి ధారిభక్తమం । దార మేరునగ ధీరశోభనా కార నూరి హృత్సారస షట్పద ॥పాండు॥
శరణాగతరక్షణ తత్పర భాసుర కర్బురచేలా । సురుచిర కౌస్తుభ భరణా శుభకర । కరుణాకర ముల్కల్లవాయునుత పరిపాలనభూ భరణ శ్రీధరా॥

దామా॥ బాలుడు సుఖనిద్ర జెందినడు సాయాన్నముగా వచ్చుచున్నయది. నీవిట నేయుండుము. నేవరగి కాలకృత్యముల నిర్వర్తిం పాండురంగస్వామి ఆలయమున కరిగి తీర్థప్రసాదముల గొనితెచ్చెద.

గుజా॥ చిత్రము.

దామా॥ (గృహము వెడలి వెలుపలి భాగమునకువచ్చి) తనలో కాలచక్రము గనుగొన నేరితరము.

ఉ॥ సంతతిలేదటంచవి । విషాదపయోనిధి గూలునట్టినా
ధాంతకు కర్ణధారువలె । గన్పడెపాపను వీనిగాంచగనే
చింతయుబాసి కౌతుకము । చేయలరారుచు నుండెగన్భశ్రీ
మంతులలె దుఃఖదూరులను । మాటయదార్థముగా నయ్యెడిన్ ॥

నాకును నాబాలకునిగాంచ యానందమేయగుచున్నది. (విచారించి) మహాత్పురుషుల యంశచే జనించినవా రెవరికి ప్రియులు గాకుంగురు. అన్నియు భగవదధీనములే.

హంసధ్వనిరాగము – రూపకము.

మాధవాకృపాంతరంగ భూధరేంద్ర ధీరపావన ॥మా॥ బాధరహిత పరమేశ్వర । భవ తారణ దీనావన భజితామల పదపంకజ ॥మాధ॥ నాగవరదనాగశయన నారాయణ పద్మనాథ । యోగిహృదయ ఖేలదానవ । నాగఖగేశ్వర కంకణనాగవినుత మణిభూషణ॥ మాధ॥ అండజేంద్ర గమనపావన మండిత ప్రదీప్తరత్న । కాండకలిక మకుటశిఖా । ఛందపరాక్రమ శాత్రవ ఖండనముల్కాల్లహారీ ॥మాధ॥

(నిష్క్రమించును)

—...—

తృతీయాంకము

తృ తీ య ర ం గ ము

పాండురంగ దేవాలయము.

విశ్వనాథుడు పద్మాసనాసీనుడై స్వామికెదురుగా గూర్చొని

బీగ్ఫలాస్ – ఆదితాళము.

పరమపదవాసయిూశా । శ్రీశా ॥పర॥ గిరిధర పావనచరణా భవభయ హరణా నీమృదుపదములె నాగతి ॥పర॥ శరణాగత రక్షణ తత్పరనామొర వినవాయీ పరామతగునా॥పర॥ బంధురపరిమెళ వనమాలాన్విత కందరశుభ ముల్కాల్ల కపిసుతా ॥పర॥

వ॥ స్వామి పాండురంగ నీకెంతయో ప్రేమ భక్తోద్ధరణ గావించుటకు నీవెన్నియో పాట్లు అనుభవించిన అవి యన్నియు సుఖాస్పదముగనే భావింతువు. అబ్బా నీస్వార్థత్యాగము నుతించ మాబోంట్లకు తరమా భవదీయ కృతాకార్యంబులెల్ల భక్తలోక కల్యాణాస్పదములే నీవు సత్కావుల ముఖమునందావేశించి వారిచే మానవ నిర్ణయ ధర్మములు

దెలుపుటకై అనేక గ్రంథరాజముల గల్పింపజేయుచు నాకట్టములయందు నాకన్న ఘనులు నాభక్తులని పలుమారు చరిత్ర చర్వణమని తలంచక లిఖింపజేయుదువువారునీకన్న ఘనులగుట వాస్తవమే.

మ॥ అపరాధంబులు వేనవేల్ గలవు । శక్యంబౌనె లెక్కింపనం
దుపలక్షింపగ నీదుదాసులయెడన్ । దోషంబు గావిజచదు
ఖపయోధిన్ బడజేయులక్ష్మణునికిన్ । ఝ్మాపుత్రిగావించగా
విపరీతశ్రమలందె రావణుడుతన్ । వేధించ లంకాపురిన్॥

సకలభూతహిత చేతస్కులగు భాగవతకోటి కపరాధము గావించుట వారిని పరిక్షించుట మానవునకు కూడనిపని.

సీ॥ సనకాదిమునుల కెగ్గొనరించు జయవిజ । యులుయాతుధానులై వెలయలేదె
కాలకంథరు తిరస్కారంబు గావించి । చిత్రకేతుడు రాక్షసేశుడయ్యె
అలవశిష్ఠునినింద సలిపి త్రిశంకుండు । సత్వరగతి శ్వపచత్వమొందె
అంబరీషునకు తానపరాధ మొనరించి । పలుబాధనొందె దుర్వాసయోగి

గీ॥ సప్తఋషులకు కీడొనర్చంగ దలచి । నహుషుడజగర మయ్యెస్వప్నముననైన
భక్తకోటికీడెన్న పాటుబడిన । తక్షణమెశిక్షబొందు యేధన్యుడైన॥

(నామదేవు తాంబూర చిరతలతో ప్రవేశము)

మోహనరాగము - ఆదితాళము.

నమోభక్తలోలా । శీలా । నమోగోపబాల ॥న॥ సుమాస్త్రజనకాక్షమాభారహార రమా రమణనీ సమానమెవరిల ॥నమో॥ వనజాతప్రభవాండసంతతులు అనిశముగర్భము నందు ధరించియు । ఘనముదమున యలరారుచుందువో కనకచేల ముల్కల్ల కపినుతా ॥నమో॥

విశ్వ॥ (చూచి సంతోషమున) మహాభాగవత శిఖామణియగు నామదేవుగారిటె వచ్చుచున్నవారలు (ఎదురేగి మహాత్మానమస్కారము.

నామ॥ అయ్యా ఎంతప్రమాదము మీరర్చకులు శ్రీహరి స్వరూపులు. అగ్రజాతి ప్రసూతులు. శూద్రకులమున జనించిన నాకు నమస్కరణ గావించి పీనిని కలుషాబ్ధి నేల ముసుపజూచెదరు. మరల మీపాదవిందములకు ప్రణుతి శతములు.

విశ్వ॥ త్వాదృశులకుండు నైజస్థితియేయిది. ఏకులమున జనించిన నేమి భగవద్భక్తి గలిగినంతనే శ్వపచుండు భాగవతోత్తముండగును. అట్టివానిని జూచినంతనే సాష్టాంగము లొనర్చ వలయునని నిన్న మీరుపన్యాస మొసంగుతరి ఆనతిచ్చితిరిగదా.

నామ॥ (అధోక్తిలో) నేను నిశ్చలమగు భగవద్భక్తి పరుండననియా మీ అభిప్రాయము.

ఉ॥ క్రూరుడ పాపకర్ముడ ప్రి । కోపితభావుడ ధర్మవిఘ్నసం
చారుడ మూఢమానసుడ । జాల్ముడ కుత్సిత వర్తనుండదు
ర్వారమదప్రపూరితుడ । వంచనుడన్ జడుడన్ కృతఘ్నుడన్
దీరని మోహపీడితుడ । నిందితుడన్ కడుమంచివాడనే॥

వెదకిన యీలాటి గుణము లెన్నియో ప్రకటమగును. యిట్టివాడనగు నన్నొకడు పెద్దవానిగా జేయుటకు మీకు నాయందున్న ప్రేమతత్వముదప్ప మరేమియులేదు.

విశ్వ॥ మీబోటి పరమ భాగవతోత్తములకు పుట్టుకతో స్వనింద పరస్తుతి స్వార్థత్యాగము. నిట్టి సుగుణము లుదయించును. మీరొక్కరు భక్తుడగానని నమ్మువారుండురా. ముంజేతి కంకణమునకు అద్దమెందుకు. మీరుదయించి నాటనుండి మిము జూచుచే యున్నాము.

సీ॥ కనులను సరిగ విప్పనినాడే శ్రీనాధు । పాదతీర్థముగ్రోలి భ్రమసినావు
క్షీరపానము విసర్జించి మధుధ్వంసి । శేషభోజనము భక్షించినావు
ఉయ్యాలలోనూగుచుండి పండరివాసు । సారకీర్తన వినగోరినావు
తప్పటడుగులువేసి దవరుచుగోవింద । భజనంబులేనోట బలికినావు

గీ॥ మీశరీరాంగములయందు శ్రీశుభక్తి । సాంద్రమై యొప్పుచున్నది శాంతమతుడు
మానితుడు నిర్మలుండు దామాజిగారి । భాగ్యమునవారికినావు సంభావనీయ॥

మీరు నిశ్చలభక్తి సంపన్నులు గాకుండిన మీరురానిది దేవాలయము కాంతి తగ్గియుండడమే గాక పాండురంగస్వామి ముఖమున నొక విధమగు దీనతత్వము ప్రకటమగుచుండును. (అటునిటు చూచి) అయ్యా చూచితిరా యింతవరకు యిన్ని దీపములచే నొప్పియున్న అంధకార బంధురముగా గన్పడు యీదేవాలయము. మీరాకచే నవీనకాంతు లీనుచున్నది. అదుగో పాండురంగని ముఖమునందు సైతము మందహాస చంద్రిక నాట్యమొనర్చుటకు మంగళాచరణ యొనర్చుచున్నది.

నామ॥ అది యంతయు మీమనోభ్రాంతియేగాని వేరేమియులేదు. అన్నిటి మనసే ప్రధానము. (అత్మైవహ్యాత్మనోబంధు రాత్మైవ రిపురాత్మనః) అను గీతాచార్యోక్తి మరచితిరా.

విశ్వ॥ మీకు వయస్సు పదిపదారేడులు దాటలేదు. యింతశాస్త్రపాండితి యెట్లు సంపాదించితిరి. అనేక సంవత్సరములు గురుశుశ్రూషణ యొనర్చు వారికింతకు శలత్వము గలుగదనియే నానమ్మకము. (విచారించి) యేమి నావెర్రితనము పాండురంగడు సర్వధా యెడబాయకుండ వెన్నంటి సంచరించుచుండ మీకు విద్యలకేమి కొదువ.

నామ॥ యిక మీకైవారములు చాలించుడు. స్వామికి నమస్కరించి వీధికరిగి కొందరికి కర్మజ్ఞాన భక్తుల బోధించవలయు.

నామ॥ కనులుమూసుకొని చేతులు జోడించి

శా॥ సాకారుండవు విద్యగర్భుడవుభా । స్వత్కోటి సప్తాశ్వశో
భాకారుండవు యోగిరాజహృదయా । బ్జాస్థితాంఘ్రిద్వయీ
మాకందారుణ పల్లవుండుసు । ధర్మామధ్య పీఠుండవ
య్యాకారుణ్యనిధే నమస్కరణ । నిత్యానంద సంధాయకా.

దేవాదిదేవుండగు నిన్నొకసారి మనోవాక్కాయ కర్మము లేకముచేసి శరణము చేసినవాడు పంచ మహాపాతకము లొనర్చినవాడైన పవిత్రుండై భవదీయ కారుణ్య రత్నాకరమందు

విహరించును. నీయౌదార్యము వర్ణనీయమే. (ఇంచుక యూరకొని) ఉపవాసములు వ్రతములు జపములు శౌచము శీలము విద్యా సౌందర్యాదులు నిన్ను సంతసింప జేయజాలవు. నీకు గావలసినది సాత్వికభక్తి అందులకే మున్ను దుర్వాసునిచే (భక్తజనులకేనుపరమగతియు) అని అనతిచ్చితిరి నీభక్తజనుల కెందునైన కొరంతలను మాటలుండునా.

( దండకము )

శ్రీరుక్మిణీనాధ రాజీవనేత్రా పయోరాశివైహార రాధామనోహార శ్రీవత్సవత్సాంక సౌఖ్యప్రద సిద్ధయోగీంద్ర హృత్పద్మ ప్రత్యూషకాల ప్రభాకర్మసాక్షిస్వమారాధితాంఘ్రి ద్వయాచిన్మయా భక్తలోకార్తి మత్తేభ సంఘాత పంచాస్య బాణాసురధ్వంస గోవర్ధనోద్ధార గోపీ వధూటీ మనఃపల్వల క్రోడ నాగాంతకస్యంద నాంభోజ గర్భాండమూల్ బొజ్జలో దాల్చి వర్తించునీపాద పంకేరుహచ్ఛాయ నామీద ప్రాప్తింపగాజేసి నిత్యా కాతూహలంబీయవే సచ్చిదానందమూర్తీ నమస్తే నమస్తేనమః.

మ॥ శిరముఁ వంచి కరంబులల్ మొగిచి । యాచింప బూనొంటినిఁ
కరమర్థిఁ భువి నెన్ని జన్మములు నా । కైన్యస్తముఁ జేసినఁ
భరితాహ్లాదమునఁ భరింతు ప్రతి । జన్మంబందు నాబుద్ధినీ
చరణాబ్జంబుల గొల్వసేయుమని । హర్షాక్రాంత భావంబునఁ.

(నమస్కరించును)

విశ్వే॥ (తీర్థప్రసాదము లుంచును)

నామ॥ (తీసుకొని భుజించి) మహాత్మా శెలవా.

విశ్వే॥ సరె నేనుగూడ వచ్చెదను.

నామ॥ చిత్తము.

(నిష్క్రమించును)





# నామదేవు కల్యాణము

## చతుర్థాంకము

### (ప్రథమరంగము)

రుక్మాబాయి పాండురంగస్వామి కూర్చొని యుండును.

రుక్మా॥ (తనలో) ఉద్ధవాంశమున జనించిన బాలుడు నామదేవని పేరొంది దామాజి గారిచే పెంపబడి స్వసంతతిముగనే సకల కళాకుశలుడై లోకకల్యాణము దినదిన మభివృద్ధి గావించు చున్నవాడు వాని వర్తన.

శంకరాభరణ రాగము – రూపకము.

కుతుకమొదవు నామదేవు నుతిదలంచగా ॥కు॥ అతిశ్రద్ధతో దీనులకును హితముగూర్చగా॥ కు॥ పరమానందంబున పామరులకు కర్మజ్ఞానము స్థిరతరమగు భక్తియోగ సరణిదెల్పు చుండునెపుడు ॥కుతు॥

పాండు॥ కమలామణి యేటికి దీర్ఘముగ నెమ్మదిన్ । విమల విచార మదేదో వెలయు నట్లుగా । కమలేక్షణ నీముఖమున గనుపట్టుచు నున్నదిగన । సుమహిత వాక్కులచేదెల్పు దుగ్ధాంబ్ధికుమారీ ॥క॥

రుక్మా॥ నాథా మీభక్త శేఖరుడగు నామదేవుని గురించి యాలోచించుచుంటిని.

పాండు॥ నామదేవని పావన నామాక్షరములు చెవికి సోకినంతనే నాకానంద మాపాదింపును. వాని గుణసంపద అనుపమానము.

శా॥ సారాసార విచారమున్ సరసి సం । చారంబు గావించు వి
స్పారానంద మనఃకుశేశయుడు తృ । ష్ణామోహ దూరుండు యా
త్మారాముండవ దీయతత్వము య । దార్థంబున్ మనుష్యాళికి
స్పారన్ దెల్పు ఘనుండు సజ్జనుడు వి । ద్వాంసుండు మద్భక్తుడున్.

తలిదండ్రులు తాను నిరంతరము మత్తీర్థ ప్రసాదోజ్జీవనము దప్ప యితరభోగములెరుంగని వారై యితరాంతర మంత్రాంతర సాధనాంతరముల స్వప్నమందైన దలంపక మత్పాద

రాజీవ సంసక్త మనః షట్పదంబులై నానామ సంకీర్తనముచే విరాజిల్లుచున్నవారు అంతి యేకాక లోకమునందెందరికో కర్మజ్ఞాన భక్తుల బోధించి వారికి తోచిన వరకు ధర్మసంస్థా పన యొనర్చుచున్నవారు.

రుక్మి॥ మీభక్తవర్గము మీవలె అసమాన శక్తి సమోపేతులే.

పాండు॥ తెలిసి నీవట్లనబోకుము. నాకన్న ఘనులు వారలు అత్యంత శాంతభక్తి యను రజ్జువుచే బంధించి వారికడనే నను నిలుపుకొందురు. వారికి నేను సర్వథా విధే యుండనై కంటికి రెప్పవలె గాచుచుందును. అట్లుకాదేని.

సీ॥ పాతాళవాసియై వరలు బలీంద్రుని । ద్వారకావలికి పాల్పడితిగాదె
దధిచోరుడని యశోదాదేవి రోలను । బంధించగను కట్టుబడితిగాదె
రమణమున రాజవర్గముజూడ పార్థుని । కతిప్రీతి రథము దోలితినిగాదె
పారిజాత సుమంబు ప్రొడయక ప్రణకో । పముచె సత్యయుదన్న బడితిగాదె
గీ॥ వ్రజనితంబినులెల్ల చీవాట్లుబెట్ట । అనుభవించితి నాకన్న ఘనులు భక్త
జనులువారికి నేపరి చారకుండ । తథ్యమిది సందియములేదు తరళనయనా.

రుక్మి॥ మీరెపుడు భక్తవిధేయులైయుండి ప్రస్తుతము నీభక్త జనుడగు నామదేవు నకు కల్యాణ మొనర్పక ఏల యుపేక్ష చేయుచుంటిరి.

పాండు॥ అదినాచే కానిపని. అదినీపని.

రుక్మి॥ ఆడుదాననగు నాచే నెటులగును.

పాండు॥ యిహలోక కల్యాణ మంతయు నీపైననే ఆధార పడియున్నది. ఆకార్య ము నీవలననే కొనసాగ వలయును. (సర్వేగుణాః కాంచన మాశ్రయంతి) అను వాక్యము నీవెరుంగవా. ప్రస్తుతము నామదేవుస్థితి విచారించ కుడువ కూడులేక నిలువ నీడలేక కట్ట బట్టలేక సన్యాసులవలె ద్రిమ్మరుచున్నవాడు. అట్టిదారిద్ర్య వరప్రసాద మొందినవారలు నావారలు అట్టివారల కెవరు పిల్లనిత్తురు. నావారియెడల నీకారుణ్యమే గలుగదయ్యె.

రుక్మి॥ గీ॥ భక్తులనుజేరి క్షణము నిల్వంగలేను । నిలతమన్నను వారునన్ నిలువనియరు
కామక్రోధాది రాహిత్య ఘనులుగాన । వారికడసాగబోదు నావర్తనంబు
నేచపలాత్ములకడ నిలతునేని.

ఉ॥ నాకరుణా రసంబున । ధనంబును పొంది మదించి మానవా
నీకము జ్ఞానమున్ మరచి । నిత్యము నింద్రియ లోలులయ్యుహం
కారవృత్తి గైకొనియు । సాధులక ప్రియ మాచరించుచున్
భీకరనారకాబ్ధిబడి । నిక్కమున్ గనజాలరచ్యుతా.

ముఖ్యము నాయనుగ్రహము బొందువారలు నేత్రములున్నను అంధులు. నీప్రాపు గోరు వారు జ్ఞానదృక్కులు గలవారు నావారికిని నీవారికిని సరిజేయ హస్తిమశకాంతరము. నీభక్త తతులకు నాకారుణ్యము అనవసరము. అనంత కల్యాణ గుణగణ సమేతుండవగు నీవే చక్ర ధరుడవయ్యు వారి యోగక్షేమము విచారించుచుండ వారికేమి కొదువ. నామదేవు కల్యా

జము మీకొక ఘనకార్యము. (విచారించి) భాగ్యనగర కాపురస్థుడగు భాగ్యశెట్టి కుమారిక రాధాబాయిని నామదేవునకు వైవాహ మొనగునటుల జేయుము.

పాండు॥ (కీర్తన పైచరణము)

తరుణీమణి నీవాక్యంతతుల జూడగ । పరమచిత్రమగుచుండెను భాగ్యశెట్టిలా ॥ సిరికల వాడును వీరలు నిరుపేదలు చర్చించగ దరిజేరగ నిచ్చునెయే కరణిగల్గు సంబంధము॥తరు॥ రుక్మా॥ మీరుబూనుకార్యము నెరవేరకుండునే । యేరీతిని నైనమీరె దీరుప వలయుగ ।। సూరిజనావన మనుజా కారమూని యటకేగియు కారుణ్యము తోడుత ముల్కల్లసమీరణ-సుతనుత ॥మీ॥

పాండు॥ మంచిది నీవనునట్లె నారోపినంత వరకు కృషియొనర్చి దామాజిగారికి భాగ్యశెట్టికి సంబంధము కుదర్చెదను. నేడే యాభాగ్యశెట్టి కడకు మనుజాకృతిచే నరిగెద పావనీ వైనతేయులారా.

## ఆంజనేయుడు గరుత్మంతుడు ప్రవేశము.

## భైరవిరాగము – రూపకతాళము.

జయజయ పండరినాథా । జయధుత కల్మషబాధా ॥జయ॥ నయగుణ దీనజనావన భయహార సంతతయా । మయనీ మాయావిలాస మహిమెన్న తరమగునె ॥జయ॥
పరమయోగి రాజహృదయ సరసిజ సంస్థితకిసలయ । చరణసకల జనుజని కరవారణ-దీనకల్పద్రుమ । మురహర కౌస్తుభగళ భూభరణ పరాత్పర దర్వీ । కరకంకణ హితవర ముల్కల్లి ప్రభంజన సుతనుత ॥జయ॥

అం॥ సకలలోక సార్వభౌముడవగు నోపరాత్పర.

సీ॥ శ్రీరమాహృదయ రాజీవ షట్చరణాయ । భద్రాత్మకాయ తుభ్యంనమోస్తు
గరు॥ దుర్వారకలుష సందోహవిదూరాయ । వాసుదేవాయ తుభ్యంనమోస్తు
అం॥ వేదాంతపత్తన । వీధివిహారాయ । స్వర్ణచేలాయ తుభ్యం నమోస్తు
గరు॥ శతకోటిమణి సమన్వితభవ్య మకుటాయ । పద్మనేత్రాయ తుభ్యంనమోస్తు
అం॥ గీ॥ వినతరుహోద్భవ శ్రీకంఠశత్రువైరి । వందితామల పాదజీవనరుహాయ
పతితజనపావనాయ శాసిత రథాంగ । పాంచజన్యధరాయ తుభ్యంనమోస్తు॥

పాండు॥ భక్తులారా నేనొక ఘనకార్య మొనర్చ సంకల్పించుకొనినవాడ మీరు మాకు సాయపడవలయును.

గరు॥ సకల కార్య సమర్థులగు మీకేమి సాయము మేమేమి యొనర్చువారము.

అంజ॥ తావకీన హస్తగత కీల్బొమ్మలమగు మేము మీకు సాయపడువారము.

పాండు॥ తనచేత కల్పించుకొను జంత్రమే జంత్రగానికి సహాయపడునటు మీరు నాకు సహాయ పడవలయును. మద్భక్తుడగు నామదేవునకు వివాహ మొనర్చ దలంచితిని భాగ్యనగర కాపురస్థుడగు భాగ్యశెట్టి కూతురు రాధాబాయి మనుకన్యను పలువిధముల

ప్రయత్న మొనర్చి నామదేవున కొనగూర్చవలయును. అందులకై నేమానవాకృతి ధరించెదను వైనతేయా నీవు సుందరమగు హయరత్నాకృతి ధరించుము మారుతీ నీవు హనుమాన్ అను పేర సేవకుండవయ్యి నాదండబాయక నుండుము. మీరిదేనాయాజ్ఞ. (రుక్మాబాయిని గాంచి) దేవీ పోయివచ్చెదము శెలవు.

రుక్మా॥ సఫలీకృత మనోరథ సిద్ధి గలుగుగాత.

అందరు నిష్క్రమింతురు,

---

ద్వితీయ రంగము

భాగ్యనగరము భాగ్యశెట్టి గృహము

భాగ్యశెట్టి కూర్చొని యుండగ అవనిక ఎత్తబడును.

భాగ్య॥ శెహాన్‌రాగము - అదితాళము.

ధనమే ప్రమోదమగుగా । ధనవంతుడు దేవతాస్వరూపుగు ॥ధన॥ ధనవంతుని పసిడి గుంటివలెభువి జనములెల్ల సంస్తవమొనరింతురు ॥ధన॥ సిరికలాని గుంటినూటంచని అరపూజ జేతురెట్టి కెలసముల ॥ధన॥ లాలితమగు ముల్క్లల్లి శరణుడౌ । గాలిపట్టి సమమెసితురు జనములు ॥ధన॥

ఎందుచూచిన ధనవిహీనులే కాన్పించుచుండిరి. వొక్కడేని నాబోటి ధనసంపత్తి గలవాడు. మచ్చునకేనియు గానరాడయ్యె ఎంత విద్యా విశారదుండయినను ధనికులనాశ్రయించె జీవనము వెడలద్రోయవలయు. ధనముగల వానికేగదా. పలుకుబడి కుదురును.

మ॥ ధనమేలోకులకున్ వశీకరణ । మంత్రంబంచు నూహించియే
పనిగావించియునైన ద్రవ్యమును । సంపాదించి వ్యాపారవ
ర్తనుడై వడ్డికి వడ్డిశేకడలచే । తన్వృద్ధి గావించుచున్
జనువాడేగద భాగ్యజీవనుడురే । చందంబు చర్చించినన్.

నిర్ధనుడు నెందరిగిన ఆపదలే బొందును. వారికి యెందుచూచిన సర్వమంగళమె. ధనవంతులేకదా యిహలోక భోగపుంజ మనుభవించి పరలోక సౌఖ్య సౌధ సోపాన మధిరోహింతురు. అందులకే (కామిగానిది మోక్షకామిగాడు అందురు. అందులకే ప్రతివాడు ధనార్జన విషయమై పాటుబడవలయును. కాని కాలము వ్యర్థముగా చననిచ్చిన లాభము లేదు. (విచారించి) ధనార్జన విషయ మాలోచించ సామాన్యమా. అందరితో నగునా.

సీ॥ భార్యాపుత్రాదులన్ వదలి శ్రమలకోర్చి । దేశదేశంబుల దిరుగవలయు
చుట్టపక్కములంచు జూడక బొత్తిగమాని । యెరిని యిలుజేర నీయవలదు
ధనము భూస్థాపన యొనరించిరే బవల్ । కడుజాగరూకుడై గావవలయు
కూటసాక్ష్యములు బల్కుటకు జంకకవేన । వేలలంచములంది వెలయవలయు
గీ॥ యింతకష్టించి నార్జించి సుంతయైన । కర్చుసేయక కోరికల్ కడకుద్రోచి
కలియొ గంజియొ ద్రాగియుకడుపునింపు । కొనుచునుండినధనవంతుడనగబరగు.

ధనమార్జించుటకన్న ముందు వ్యయపరిస్థితి చక్కగా నేర్వవలయు. దానినెరుంగకున్న తానుకష్టపడి సంపాదించిన ధనమంత త్రుటిలో మాయమగును. ధనవంతుల పక్షీరులుగా యొనర్చుట కనేకులుందురు.

ఉ॥ దానములంచు బ్రాహ్మణ । వితానము వచ్చెను నెక్కునట్టినూ
గానకళా ప్రవీణతను । గాంచుడటంచని వేశ్య కామినుల్
దీనులమంచు దాసరులు । తీర్థనివాసుల మంచుపండితుల్
గానరు మాసమంబనెడు । గారడివారలు భట్టుమూర్తులున్.

అంతియేగాక.

సీ॥ శిష్యుల చిత్తంబు స్వీకరించెడివ్య । తేజంబులేనట్టి దేశికులును
శయ్యాచమత్కార శబ్దంబులరయక । తప్పుడు పద్యముల్ జెప్పుకవులు
శాంతిశయాశౌచ సత్యంబుమానిదు । స్తంత్రజ్ఞులౌ హరిదాసవరులు
తప్పులు గల్పించి దండించగాబూని । లంచముల్ గొను నృపాళిభటులు
గీ॥ దొమ్మరు భాగవతులును దొంగవారు । తోలుబొమ్మలవారు పంబాలవారు
జ్యోతిషులు వైద్యవరులును మాపకార్లు । ధనికులకు కీడునేయుగదలతు రెపుడు.

వేయేల ప్రపంచమునగల మానవుల కందరకు ధనికుపైననే కన్నువారల యబ్బసొమ్మైన వీరలు సూరకొనిరా. తెలివితక్కువ వయిధేయులందరు. నిరుద్యోగులై కాసువీసము సంపాదించలేని వారలై ధనవంతుల నాశ్రయించి వారికి చతుర్థామ మొసంగదలచిప త్రికలని చందాలని సంఘస్థాపనలని మఠసంస్కరణములని దేవాలయ ప్రతిష్ఠలని పరోపకారమని (పరోపకారార్థ మిదంశరీరమని పరోపకారాయ సతాం విభూతయయని) వెర్రిమొర్రి కూతల కూసి ధనములాగు ప్రన్నాగములు బన్నుచుందురు. అవియన్నియు బొత్తిగా వాకసమ్మతములు యివి యన్నియు ధనార్జన కైమైన యుపకరించునాయనిన వాటివలన యేమియు లాభములేదు. (విచారించి) యేదో బొల్లిపూస రామాయణ గాధల మరిల వేయుచు నా ప్రస్తుత కార్యమును పూర్తిగా మరచితిని. లెక్కవ్రాయవలయును ప్రాత బాకీదారులకు నోటీసుల పంపవలయును (అని లెక్కపుస్తకము తీసి వ్రాయును)

కమల-రాధా (యిరువురుప్రవేశము)

ఆసావేరిరాగము - ఆదితాళము.

మురళీధరా। కరుణాకూపార ॥ము॥ పరమాగుణాకర రుక్మిణీ హృత్సరసిరుహ భాస్కర ఖలవిదారి ॥ము॥ వ్రజకామినీ నిజభావహర సుజనావనా సంస్తుత పాదపద్మ ॥మురళీ॥ భువనోద్ధరా ముల్కల్లపారి। పవనాత్మజా వరదా పరేశా ॥మురళీ॥

కమ॥ నాథా పండరీపుర ప్రయాణమెన్నడు నిశ్చయించితిరి.

భాగ్య॥ (తనలో) గెడ్డివచ్చె మరల పాడుమా యను సామెత జ్ఞాపకమునకు వచ్చినది. మరల పండరియాత్రాగోలయే ముందుకు వచ్చినది.

రాధా॥ నాయనా పండరీపురమున కరుగవలయుననిన నాకును కౌతూహలమగుచున్నది.

భాగ్య॥ అమ్మాయి పండరీపురమున నేమున్నది.

రాధా॥ నాయనా అచట చంద్రభాగ నదీస్నానము భక్తుల పాలిటి కల్పభూజమగు పాండురంగణి అర్చావతార దర్శనము నిరంతరము భక్తులచే గావించు భజనలు స్వామిని నివేదిత తీర్థప్రసాదము మొదలగునవి సేవించి అనుభవించి ఆలకించిన వారలు నిన్న పాండురంగ మహాత్మ్యమను పుస్తకము పఠించితిని అందుగలవు.

భాగ్య॥ హాహ్హాహ్హా అవి యన్నియు తెలివి దక్కువవారి మాటలు. అవి యన్నియు పిచ్చికూతలు.

సీ॥ చంద్రభాగాధునీ స్నానమాడుటకన్న। మనవీటి చెరువులో మునుగ మేలు
పాషాణ కల్పిత పాండురంగణి సేవ। కన్నయీకుడ్యముల్ గనుట మేలు
కామసాధువులయ్యి గావించు భజనక। న్నను నీవు జేయు కీర్తనము మేలు
తీర్థప్రసాద దుస్థితి భక్షణముకన్న। కఠినోపవాస మార్గములు మేలు
గీ॥ తీర్థయాత్రలు దానముల్ దేవపూజ। జపములును సేయువారనిమ్కలుమతులె
తలచి చూడంగ యివి యన్నృతంబటంచు। పలుకువాడను ఘంటారవంబుపగిది॥

రాధా॥ తండ్రి వేదబాహ్యమగు నాస్తిక మతస్థునిగా నుపన్యసించ మొదలిడితివి.

భాగ్య॥ నేనను విమయ మునిశ్చయమా.

రాధా॥ మీరే యీవిధమున పల్క మీకన్న తక్కువవారేమనియెదరు.

భాగ్య॥ యేమనియెదరు నేను నది కాదనువారెవరో నాముందుకువచ్చి [illegible] మనుము.

రాధ॥ అపుడే లోకమంతయు మీస్థితికిరానులేదు. ధర్మమును నుద్ధరించుటకై యనేకులు పాటుబడు చున్నవారలు.

చ॥ ఖలులవారించి సజ్జనుల। గావగ ధర్మము నుద్ధరింపగా
యిలజనియించి లోకముల। నేలెడిభారము సంతతంబుగా
తలపయి నుండెనంచని। యదోర్థముగా వసుదేవనందనుం
సలుపడె బోధజన్యమున। సారధియై మనుసవ్య సాచికిన్॥

తివాక్యము తప్పనటుల భగవానుడీపు దక్షోగతి పాలగుచున్న ధర్మ మద్ధరించుటకై పాం డురంగిడై యవతరించి అతని భక్తుల యనేకుల దనమాయచే పుట్టించివారిచేసకలధర్మము లుద్ధరించు చున్నవాడు ప్రస్తుతము మీవాదన మిథ్యావాదమని నేనే యనియెదను.

భాగ్య॥ యెట్లు మాటలచేతనా.

రాధా॥ మాటలచేతనే మీ అభిప్రాయము పండరీక్షేత్రము పండరీక్షేత్రము దివ్య స్థలము గాదందురా.

భాగ్య॥ వైరిదాన. నామరూప శూన్యుడగు భగవంతున కాకార ముండునా. రాళ్లు దేవులైన రాసులు మిగ్రంగవా భగవంతుడు మనలోనే యున్నవాడు.

రాధా॥ మనలోనే దేవుడున్నమాట సత్యమే. మనలో నుండు పరాత్పరుని దెలుసు కొనుటకై సాధనము విగ్రహారాధనము కర్మజేయనిది జ్ఞానమెట్లు కలదో విగ్రహారాధన జేయనిది మనలో నుండు పరాత్పరుని గనుగొన జాలము. అందులకే మన పూర్వులు శృతిస్మృతి పురాణాదుల శోధించి ప్రతిమల గల్పించి బీజాక్షర సంపుటి జేర్చి వాటికి వేదమంత్రములచే ప్రాణప్రతిష్ఠాదు లొనర్చి సంపూర్ణ మూతీక్రత్వము గలుగజేసిరి. అవి రాతిబొమ్మలెట్లగును. నిరుపేదవాడై నొకడు కష్టపడి ధనమార్జించి కోటీశ్వరుడై అఖండసౌఖ్య మనుభవించుచునపుడు వానిని యెవడైన మరల పేదవాడని పిలువ సాహసించునా.

భాగ్య॥ కాయ శోష కంఠశోష యెందులకు యిది యంత వట్టికల్పిత ప్రసంగము.

కమ॥ కల్పిత ప్రసంగమని దేనిచే నిర్ణయించెదరు.

భాగ్య॥ అనుమాన విషయము గావున.

కమ॥ వేదములు ఆప్తవాక్యములు దాని నొప్పుకొన కుండిన మీజన్మముగూడ నిర్ణ యించుకొనలేరు. మీజన్మమంతయు అనుమానముపైననే ఆధారపడి యున్నది వొక జన్మమననేల. ప్రపంచమంతయు అనుమానము పైననే ఆధారపడియున్నది.

భాగ్య॥ యిప్పకాలపు స్త్రీలు విద్యావంతులగుట యింట వారలచే భయభక్తుల వీడి వాదించుటకే కాబోలు.

మోహన ఆది.

చాలుచాలు మీవాక్సంతతులు వినగ మోదమలరె ఏలను యీదీర్ఘోపన్యాసములును ఛీఛీ॥ చాలు॥ స్త్రీలకుచనువిచ్చినంత సిగ్గుదీయగలరని కవి జాలము వచియించుమాట సత్యము గననయ్యెగా ॥చాలు॥ చెడుకాలము వచ్చెగాన పడతులు పురుషులతోడుత కడుజగములా డుచు తప్పుడుమార్గము బట్టిరకట ॥చాలు॥ అవనినొప్పు ముల్కల్లా పవనసూతి బోధించిన చెవికెక్కనె అనుడువులు చిత్తతోషణము సేయునే ॥చాలు॥

సేవ॥ అయ్యా యిరువురు క్రొత్తవారలు మీదర్శనమునకై యరుదెంచి ద్వారము కడ నిలిచియున్నవారు యేమిశెలవు.

భాగ్య॥ (తనలో) యెవరై యుండవచ్చును బ్రాహ్మణులు యాచనకై రారుగదా (విచారించి) ఎవరైనను సరియే. వారల కారణముగా గల్పించి యీఅడుపులలను లోని

కనిపిన ప్రస్తుత వాదోపవాదములు శమించును. పండరీ ప్రయాణగోల కొంతశమించును. (భార్య పుత్రికనుగాంచి) యెవరో నూతనపురుషులు నాతో మాటలాడుటకై జనుదెంచి ద్వారకడ నున్నవారట మీరు లోని కరుగుడు వారిందు రాగదు.

కమ-రాధా॥ చిత్తము.

(నిష్క్రమింతురు)

భాగ్య॥ (నిట్టూర్పువిడచి తనలో) అమ్మయ్యా యిప్పుడు చెవులు గింగురుమను వాదము శమించినది. (సేవకునిగాంచి) ఓరీ వారిని దోడ్కొనిరమ్ము.

సేవ॥ చిత్తము.

(నిష్క్రమించును)

భాగ్య॥ (తనలో) ధనవంతులకన్నియు ఆవదలే యింతవరకు భార్య పుత్రికతో నాస్తికవాద మొనర్చి చివరకు అదలించి పండరీ ప్రయాణము మాన్పించి కొంత ధనము కాపాడితిని. యీవచ్చువాడు యాచకుడో శేరగాడో.

(పాండురంగశేటు హనుమాన్ యిరువురు ప్రవేశము)

పాండు॥ జయము జయము భాగ్యశెట్టిగారు.

భాగ్య॥ (తనలో) వీరు యాచకుల వలె గన్పట్టుటలేదు. ఉద్యోగవంతులగా గన్పట్టుచున్నవారలు. వీరికి తగుమర్యాద లొనర్చి మంచిలాభము పొందు ప్రయత్నము నొనర్చవలయును. (ప్రకాశముగా) అయ్యా దయసేయుడు (యెదురేగి తీసుకొని వచ్చి) యీయుచిత పీఠమున కూర్చుండుడు.

పాండు॥ తాము కూర్చుండుడు.

భాగ్య॥ మంచిది. (యిరువురు కూర్చుందురు)

భాగ్య॥ తమదేగ్రామము.

పాండు॥ పండరీపురము.

భాగ్య॥ మీపేరేమి.

పాండు-కం॥ ననుగనుగొని పలుమారులు । అనుపమ మృదుమధురభాష ణాన్వితులగుచున్
వినయమున పాండురంగా । యనిపిలుతురు బాలవృద్ధు । లందరువేడ్కన్॥

భాగ్య॥ మీరుచేయు ఉద్యోగమేమి.

పాండు॥ నిరంతరము దామాజీగారిని సేవించుచు వారిసేవ యందప్రమత్తుడనై సంచరించెద.

భాగ్య॥ ఉద్యోగనిమిత్త మెన్నిసారులో పండరీపురమునకు వచ్చితిని. మిమ్ము గాని మీశేటుగారిని గాని చూచి యెరుంగనే.

పాండు॥ అయ్యా మీరు పెద్ద ధనికులు మీబోంట్లకు చూచినపుడే జ్ఞాపకము. క్షమించుడు అడుగుదాటిన అరువదియారు చిత్తములు గలవారు ధనికులు వారి దృష్టి పథ

మున మాబోంటి వారందురనుమాట కల్ల. మిమ్ము నేకసారులు మాపురముననే జూచితిని. మీరుమాత్రము నన్ను గుర్తించక నోయితిరి.

భాగ్య॥ (విచారించి) చూచియుండవచ్చును. ఉద్యోగ గందరగోళముచే యిప్పుడు చూచిన వారిని ఉత్తరక్షణమందు గుర్తించుటకు కష్టముగా నుండును. నాకు ప్రొద్దున లేచినది మొదలు సాయంత్రము వరకు అడుగు కదలించుటకు వీలు లేకుండును. అవివ యమున క్షణమేమారి యుండిన యెంతో నష్టము గల్గును. మీశేటుగారి ఉద్యోగమేమి.

పాండు॥ కేదార గౌడరాగము – రూపకము.

తరమానె వర్ణనము సేయగదామాజివిభవము ॥తర॥ సురచిరమై శుభకరమై చోద్యమానుగా ॥తర॥ నిరతమునుద్యోగము యేమరకుండునుమా । పురములోన వన్నెకెక్కు పూజనీయుడా ॥త॥ ధరణి నతిని బోలునట్టి ధనికుని నేగనగజాల చిరపుణ్యుడు మల్లా తరుచరుసాక్షి ॥తర॥

భాగ్య॥ నెలకు నీకెంత వేతన మొసంగును.

పాండు॥ వేతనములేకయే నేనాతని కొలువున నుండెదను.

భాగ్య॥ వేతనము లేకపోయిన నీభార్యా పుత్రాదుల నెట్లు పోషింతువు.

పాండు॥ నాకథ రామాయణమంత యున్నది అది యెరింగించిన త్వాదృశులకు అసహ్యముగా నుండును. అడిగినరు కావున చెప్పకుండుట ధర్మముకాదు.

సీ॥ కనిపెంచినట్టినా జనయిత్రి జనకులె । వ్వారలొ నెరుగ స్వప్నమునమైన

భాగ్య॥ (తనలో) పాపము అతిబాల్యముననే యీతని దలిదండ్రులు గతించి యుండవచ్చును.

పాండు–సీ॥ నాకన్న ఘనులయ్యె నాబందువర్గంబు । వారిని జేరి నే బ్రతుకువాడ

భాగ్య॥ (తనలో) మాతాపిత విహీనుడని బాంధవులు చిన్ననాటనుండి పెంచవచ్చును. యిపుడదే చనువున వారికడ కీతడరుగుచుండ వచ్చును.

పాండు–సీ॥ ధనవంతులనుజేరి మనుచులోకంబుల మోహాబ్ధి మునుపునా ముదిత ఘనత

భాగ్య॥ భార్య జారిణియై యుండవచ్చును. జారిణియైన యెడల యెవ్వడైన పరులతో చెప్పకునునా (విచారించి) కాదుకాను. ఏదో సంశయముగా నున్నది మనకు దీనితో అవసరము లేదు పోని.

పాండు॥ సీ॥ నివసింప కొంపలే కవరీయులైయొప్ప । వారిసద్మములందు వరలుచుందు

గీ॥ దీనులకు నెల్లకాలంబు దిక్కునేను । సరుల పాపును గోరెడి వాడగాను

నీచముచ్చంబులేదు నాదృష్టియందు । శితు మిత్రత్వ భేద బు సల్పువెఱ్ఱ॥

భాగ్య॥ నాదగ్గర లెక్క వ్రాతకై యుండగలవా.

పాండు॥ మాయజమాని యగు దామాజిగారిని నూడకుండి వొక నిముసము నిల్వజాలను. అతని నాయందంతె అయిన మీరు నన్నాపురికొనజాలరు. నేజేయు కార్యములు మీబోంట్లు కసహ్యముగా గన్పించును.

భాగ్య॥ మీసేటుగారిదేకులము
పాండు॥ మేర కులమువారు.
భాగ్య॥ వారికి సంతానమెంత.

పాండు॥ వారికి సంతులేక పరితపించగ నొకనాడు గృహిణితో భీమనదిలో స్నానమాడుతరి నొకపాపడు లభించగ వానిని నాకు జూప వానికి నామదేవని నామకరణం బొనర్చితిని వారా పాపని కడుప్రేమచే బెంచుచు వచ్చిరి.

భాగ్య॥ బాలుని వయస్సెంత.
పాండు॥ పదునెనిమిది వత్సరములు దాటుచున్నవి.
భాగ్య॥ వివాహితుడా.
పాండు॥ అవివాహిడు
భాగ్య॥ వివాహము సేయక మీసేటుగారు అట్లు పతుజేసి రెందులకు.
పాండు॥ తగిన సంబంధము కుదురక.

శా॥ ఎందెనకా గనుగొన్న నిర్ధనకులే । నేమూల నీక్షించినకా
పందల్సార విచారహీనులు వృథా । వ్యాపార పారీణులే
మందప్రజ్ఞులు లోభవర్తనులు । సామాన్యస్థితుల్ గల్గువా
రిందామాజి యనేకమారులు । మర్శించెకా శ్రమంబెరిచకకా.

అట్టివారు వారికి నచ్చరు. వారు మహాచక్కని భావములుగలవారు సత్యమూర్తి శాంతశమదమాది గుణగణముల కాలయము అందులకై యిప్పటంతల మానివేసిరి.

భాగ్య॥ వారి ఐశ్వర్యమెంత.

పాండు॥ యెంత గణిక విశ్యా విశారదుండయిన యింతయని చెప్పరాక యున్నది. కొంతవరకు కలియుగ కుబేరుడనవచ్చును.

భాగ్య॥ వారి భవనము అతిమనోహరమయి చూపులకొక వింత గొల్పుచుండ వచ్చును.

పాండు॥ భవనమాట జ్ఞాపకము దెచ్చినంతనే నాకు శరీరమున పులకాంకురములు వచ్చుచున్నవి.

గీ॥ అతిమనోరమైన కుడ్యములు హాళి । తారతాన్విత శశిసదా దర్శనంబు
జేయుటకు వేడ్కపడ్తుదురు చెప్పనేల । అపరకైలసంత మందిర మను~~~~గు.

భాగ్య॥ వారి యింటిగల జనసంఖ్యయెంత.
పాండు॥ (నాలుగు వేళ్లు చూపును)

భాగ్య॥ (తనలో) అమ్మ యోనలు బదిమందియో నాలుగువందల జనమొ ప్రకాశముగా పిల్లవాడే మైన విద్యావంతుడేనా.

పాండు॥ చదువులలోనుండిన రహస్యము బాగుగా నెరింగినమేటి. అయ్యా వారి విషయము గుచ్చిగుచ్చి యడుగుచుంటిరి వారితో సంబంధ మందెదరా యేమి.

భాగ్య॥ నాకొక కూతురు గలదు. నేనిందాక పిల్లవానికై యనేకతావుల గను నించితిని కాని తగిన సంబంధము కుదురుటలేదు.

పాం॥ అటులైన మా శెట్టిగారి కుమారుడగు నామదేవుగారి కొసంగుడు.

భాగ్య॥ అంతటి భాగ్యము మాకు లభించునా.

పాండు॥ మీకును మా శేటుగారికి సంబంధము కుదుర్చుకై నేనరుదెంచితిని.

భాగ్య॥ పాండురంగశేటు మీరు సామాన్యులు గారే.

పాండు॥ మీ అమ్మాయిగారి వయస్సెంత.

భాగ్య॥ పన్రెండు సంవత్సరములు.

పాండు॥ శుభస్య శీఘ్రమనునట్లు యిపుడే పురోహితుని రావించి లగ్న మూర్తము నిర్ణయించుడు. సర్వము నేనే నెరవేర్చగలను.

భాగ్య॥ ఓరీ ప్రతీహారి నీవు సత్వరముగా జని మన శివశంకర శాస్త్రిగారిని తోడ్కొని రమ్ము. (హనుమాన్‌నుగాంచి) యీతడెవడు.

పాండు॥ యీతని చరితము కడువింతయైనది.

సీ॥ బాల్యకాలమునుండి బ్రహ్మచర్యవ్రత । నిష్ఠాగరిష్ఠ విశిష్టమతుడు
తొల్లి నాకొకకతి దుండగీడుల కొట్లు । కొలది గారణమున గూల్చినాడు
కడుప్రీతితోడ నాయడుగు కెందామరల్ । భజియించుసతతంబు భక్తవరుడు
పసిడి గుంటికి సరిపడు శౌర్య గాంభీర్య । వైభవోపేతుడై వరలువాడు

గీ॥ అజిమతుండను సామీరి యట్లు నాకు । యెట్టి కెలశెలందైన యించుకైన
శ్రమయటంచని నెంచకసల్పునయ్య। హనుమదాఖ్యుండు ఘనుడు శోభనగుణుండు॥

భాగ్య॥ మీ చరిత్రములు కడువిచిత్రముగనే యున్నవి. లోనికి దయచేయుడు.

పాండు॥ చిత్తము (హనుమాన్‌తో రహస్యముగా) నీ నాగృహిణియగు రుక్మాబాయికడ నొక వారము సొమ్ము అడిగి తెమ్ము యిప్పుడే లగ్ననిశ్చయము చేసి పిమ్మట వధూనిశ్చయ మొనర్చవలయును.

హను॥ చిత్తము. (అందరు నిష్క్రమింతురు)

---

## తృతీయరంగము

హనుమాన్ భాగ్యశెట్టి రాధాబాయి కమల పాండురంగశేటు ప్రవేశము

పాండు॥ (తనలో) యీ రాధబాయి మా నామదేవునకు తగిన కన్యారత్నమె.

భాగ్య॥ (తనలో) యీ పాండురంగశేటుగారు కడుమంచివారు వీరి శేటుగారితో సంబంధ మొనర్చి తగులాభము పొందవలయును (భార్యనువీక్షించి) వీరిది పండరిపురము దామాజి శేటుగారికడ నుండువారు. వారి కుమారుడగు నామదేవుగారికి మన రాధాబాయిని నీయ దలంచితిని. వీరిపేరు పాండురంగ శేటుగారు కడుమంచివారు పుత్రికను

గాంచి అమ్మాయి యిందనుక పండరీ దివ్యక్షేత్రమున కరుగుదమని యంటివి నిన్ను పండరీ పురమే నీయదలంచితిని యిక నీకోరికలు ఫలించును.

రాధా॥ ఆహా నాభాగ్యము వర్ణనీయము.

పాండు॥ శేటుగారు యింకను బ్రాహ్మణోత్తముడు రాకయున్నవాడు.

(శివశంకరశాస్త్రి ప్రవేశము.)

దుర్గరాకము – ఆదితాళము.

సంతసమయ్యెనుగా తలంపగ ॥సం॥ వింతకాలమనిపించె నేడు నా । స్వాంతమందున శబాసు భళీభళీ ॥సంత॥ పరమలుబుడగు భాగ్యశెట్టినన్ త్వరగతి పిలచిన పనియేమ్యాదియో ॥సం॥ కడుసుదినము ముల్కల్లపావనీ । యడుగులు నామది ధ్యానమొనర్చెద ॥సంత॥

భాగ్య॥ అదుగో తలచిన మాత్రమున నే భూసుర పుంగవుండరుదెంచినడు.

పాండు॥ భూదేవా నమస్కారము.

శివ॥ సకలసంపత్పరిపూర్ణమస్తు.

భాగ్య॥ శాస్త్రిగారు కూర్చుండుము.

శివ॥ చిత్తము.

భాగ్య॥ శివశంకరుడా మాఅమ్మాయియగు రాధాబాయికి వివాయము దలంచిని సుముహూర్తము విచారించుము.

శివ॥ (తనలో) మంచి యదను గలిగినని యిదేసమయమున యీతని కడనుండి నాలుగు కాసులు రాబట్టవలయును. (ప్రకాశముగా) యెక్కడకీయ దలంచితిరి.

పాండు॥ ఆదియంతయు మీ శేటుగారు సావకాశముగా నున్నప్పుడు నీకెరింగించెదరు కాని మొదట సుముహూర్తము నిర్ణయించుము.

శివ॥ యింత తొందరెందుకయ్య మాటలాడిన నీకు ముక్కుమీద నే కోపమున్నట్లున్నయది. మా శేటుగారు మహాశాంతులు స్తోదరహితులు ధార్మికులు.

పాను॥ శాస్త్రిగారు వాదోప వాదములచే కాలక్షేపమొందుటకు కానిండు.

శివ॥ నే నేమి వాదోపవాద మొనర్చితిని. తుమ్మటము మీవంటె శతాయువ్య మనుష్య మీవంటె అనునట్లు అన్నియు మీరే యనుచుంటిరి. (మంచిది పిల్లవాని జన్మ నామము)

పాండు॥ నామదేవు

శివ॥ (వేళ్లు లెక్కించుకొని) అనూరాధ నక్షత్రము అమ్మాయి వ్యవహార నామము రాధాబాయి చిత్తానక్షత్రము (పాండురంగనిగాంచి) కాదండి.

పాండు॥ అవును రాశికూట గహకూటము లన్నియు మేము చటనే చూయించుకొనియెదము. కాని వివాహ ముహూర్తము నిశ్చయింపుము.

శివ॥ శివః (పంచాంగముదీసి) నేటికి ఆరుదినములకు లగ్నముగలదు. ఆనాడు వధూవరులకు తారాబలము బాగుగానున్నది.

పాండు॥ భాగ్యశెట్టిగారు మొదట నిశ్చితార్థము గానిండు.

భాగ్య॥ మీచిత్తము.

పాండు॥ హనుమాన్ నీకడనున్న ఆభరణములు యిటుతెమ్ము.

హను॥ చిత్తము (ఆభరణములు దెచ్చిపెట్టును)

భాగ్య॥ (ఆతురతతో జూచుచుండును)

పాండు॥ భూదేవా వాటికి పూజసేయించుము.

శివ॥ అమ్మాయి రాధాబాయి యిటుకూర్చుండుము. (రాధాబాయిని కూర్చుండబెట్టి నగలకు పూజజేయించి) సువర్ణపుష్పదక్షిణాం సమర్పయామి (యిక్కడ అయిదు రూపాయిలు రావలయును.

పాండు॥ మంచిది (అని రూపాయిల నిచ్చును)

శివ॥ సుమంగలీర్యం వధూరిమాగ్ం సమేతపశ్యత । సౌభాగ్య మస్యైదత్వా యాథాస్తం విపరేతన (నగల రాధాబాయికి అలంకరించును)

పాండు॥ అయ్యా యీనగలు నూతనములు కావు అతి పురాతనములు. వివాహకాలమున వీటికన్న మిన్నగొనివచ్చెదము. ప్రస్తుతము క్షమించుడు [లగ్నపత్రిక వ్రాయించుడు]

భాగ్య॥ భూసురుడా లగ్నపత్రిక వ్రాయుము.

శివ॥ అయ్యా వ్రాసెదగాని వరునకెంత వరదక్షిణ నీయగలరు.

పాండు॥ ఓయి వెర్రిబాపడా మాశేటుగారు వరవిక్రయ మొనర్చువారు గారు. ధనమొక తృణప్రాయముగా చూచెదరు. వొకవేళ మీరిచ్చెదమన్న వారుగ్రహించువారు కారు. మీరు వారికి తగు గౌరవము చేయుటయే చాలును. మాకు కన్యయే దక్షిణ. పత్రిక వ్రాయుడు.

శివ॥ పత్రిక వ్రాయును

భాగ్య॥ తనలో నేడే సుకృతాత్ముల మోముగాంచితినో గాని నాభాగ్యరేఖ ఫలించినది. వివాహకాలమున వారికి తగుమర్యాద లొనర్చి వేయిరూప్యంబుల కర్చు సేసి మరల నాలుగైదువేల రూపాయిల పొందవలయును.

పాండు॥ అయ్యా యికమాకు శెలవిచ్చెదరా.

భాగ్య॥ వంట సిద్ధమైనది మీరు భోజన మొనరించవలయును.

పాండు॥ గతికిన సంబంధము అతుకదందురుగదా.

భాగ్య॥ అది పామరులాడుమాట రండు.

పాండు॥ మంచిది.

(అందరు నిష్క్రమింతురు)

———



# నామదేవ కల్యాణము

## పంచమాంకము.

### ప్రథమరంగము

(హనుమాన్ కూర్చొని రామభజన జేయుచుండును అవనికయెత్తబడును)

హను॥ (తనలో) భాగ్యశెట్టి తనతో సమానులగు సిరికలాడు ప్రపంచమున లేడని భావమున అంతులేని గర్వ సంయుక్తుడై యున్నవాడు యితని ధన మెంతగలదో నేడే పరీక్షించెద.

కమల॥ (ప్రవేశించి) హనుమాన్ భోజన ముంచెద కూర్చుము.

హను॥ చిత్తము.

[కమల నిష్క్రమించి మరల ప్రవేశించి విస్తరివేసి నిష్క్రమించును]

హను॥ మోహనరాగం - ఆదితాళం

తృప్తి పరచగలరా ననువీరిప్పుడు గనుగొనెదా ॥తృప్తి॥ లిప్తమాత్రమున వీరిగర్వ మవలీల భంగపరచెద గనుగొనియెద ॥తృ॥ లోకమందు సిరికలాడు వీడటె శ్రీకమలేశ్వరు డనితలంచడె ॥తృ॥ వరములకల్లి ప్రభంజన సుతుడని యెరుగడు నను కావరముగ దేమహా ॥తృ॥

చ॥ సరసిజ గర్భ చంద్రధర । షణ్ముఖగోత్ర విశోధిపన్నసం
భరిత ప్రమోద సంకలిత । భావునిగా నొహరింపలేరుదు
ష్కరులు పరాపకారగుణ । జాల్ములుసతిస మొందజేతురే
అరయగ పిల్లకాల్వలవ । వార్ధిని సంబర ము దజేయునే

కమ॥ (ప్రవేశించి) నాయనా పాండురంగశెటుగారు మావారు లోన భుజించుటచేత నాలస్యమైనది (అని పప్పువేసి నిష్క్రమించును)

హను॥ (తనలో) యీమె వచ్చునంతలో యీవిస్తరియందుగల నూపము భక్షించెదగాక.

గీ॥ చక్రధర శ్రీనివాస విశ్వంభరేశ। పరమ పురుషముకుంద శ్రీధరయనంత
పద్మనాభ కృపానిధే వాసుదేవ। అవ్యయానంద జోహారులయ్యనీకు॥

( పప్పు తినును )

కమ॥ (అన్నగొని ప్రవేశించి) యింతకుముందు విస్తరియందుంచిన సూపమే మయ్యెను.

నాను॥ అమ్మా ఆకలి మిక్కుటముగా నగుచుండుటచే అన్నము వచ్చువరకు నాక జాలక సూపను రూపుమాపితిని.

కమ॥ అయిన సరియె. మరల తెచ్చెదను. (అన్నముపెట్టి నిష్క్రమించును)

నాను॥ సూపను వచ్చువరకు అన్నమును భక్షించెద.

దుర్గారాగము – ఆది.

రామంభజమనసా। సీతా ॥రామం॥ కామితఫలదం కాకుత్స్థాన్వయ సోమం సురచిర శ్యామ లగాత్రం ॥రామ॥ దేవాదిదేవం। రామం ॥దేవా॥ పావనచరితం భవభయ విజితం భావజ జనకం భక్తసుఫాలం ॥రామ॥ లీలమనుజరూపం। రామం॥లీ॥ వాలితసుగుణం పాలిత భువనం క్షాళిత దుష్కృత జాలం సతతం ॥రామం॥
(అన్నముతినును)

కమ॥ (తనలో ప్రవేశించి) సూపమును గొనివచ్చువరకు అన్నమును భక్షించినాడు యింతయాకలి మనుజులకు తగునా (విచారించి) యీసూపమునుంచి మరల అన్నము గొనివచ్చెద [అని పప్పువేయును] అన్నము గొనివచ్చెదను. (నిష్క్రమించును)

నాను॥ మరల సూపభక్షణ మారంభించెద. (పప్పుతినును)

కమ॥ (అన్నముగొని ప్రవేశించి) సూపమును విస్తరి క్రమింగుచున్నడా. యేమి.

నాను॥ లేదులేదుతల్లీ అన్యాయము విస్తరిపై నేల వేయవలయును నేనేభక్షించితిని

కమ॥ (అన్నమువడ్డించి నిష్క్రమించును)

నాను॥ లోపల భాగ్యశెట్టిగారితో భుజించుటకు పాండురంగడు కూర్చొని యుండి యెడతెగని సంభాషణ మారంభించి యుండుటచే నాకు మంచితరుణమ్ము లభించినది. యీ అన్నమును మరల నామె వచ్చువరకు పూర్తిగా భక్షించెద (అని అన్నముతినును)

కమ॥ [ప్రవేశించి] యిదియేమితిండి యిట్లెక్కడనైన మానవులు తినగలరా పప్పు దెచ్చువరకు అన్నమును దినుచున్నవాడు అన్నము దెచ్చువరకు పప్పుమింగుచున్నవాడు. వీనిది కడుపా కాగా లేక భావియా చెరువా. యేమి యద్భుతము. వీనిబోటి తిండి పోతును ఎక్కడ వీక్షించి యుండలేదు. యిట్లు తినుచుండిన భార్యా పుత్రాదుల నెట్లు పోషించును. (ప్రకాశముగా) అన్నమేమైనది.

నాను॥ భక్షించితిని అమ్మా మిక్కుటముగా నాకలి యగుచున్నది దయదలంచి కొంచము త్వరగా వడ్డన సేయుడు.

కమ॥ నీకు భార్యాపుత్రాదు లెందరు.

నామ॥ భార్యా పుత్రాదులుండిన నాజీవితము వృథయే యగును. వారు లేరుకావున నేనుసుఖజీవినై సంచరించు చుంటిని.

కమ॥ (తనలో) యింటిన గలిగినదెల్ల భక్షించువానికి భార్యా పుత్రాదులుందురా. (నిష్క్రమించును)

నామ॥ పరిజల రక్తము కడుపారగోరితి సుఖించువారలు ధనికులు వారల నెంత పీడించిన పాపముండదు.

కమ॥ (అన్నము పప్పు వడ్డించి) చారుగొని వచ్చెదను (నిష్క్రమించును)

నామ॥ మంచిది గొని తెండు యీామె వచ్చువరకు నిదియంతయుకాజేసెద. (తినును)

(కమల ప్రవేశించి) [అచ్చెరువుతోగాంచి] యింటియందు వండినవంట యిదివరకే సరిపోవుటచే మరలమరల రెండుమూడుసారులు వండించి తినినది యంతయు క్షణములో భక్షించెదను. యిదియేమి విపరీతము. యిపుడీతనికి కడుపునిండ భోజన మిడకుండిన యీతడు జని దామాజీగారితో వచించిన యిదియేమి సంబంధము మొదటి బుక్కలనే కంకెడు రాయి అనునట్లు మాకడనుండి యరిగిన వొక బంటువానికే భోజన మిడని భాగ్య శెట్టి ధనమేటికి అని నిందించి మాకన్యను తన పుత్రునకు చేసుకొనక యుండునోయేమొ యీ విషయము మావారితో యిప్పుడు చెప్పుటకు వీలులేదయ్యె వీడు నిక్కముగా విచారించిన దేవతా పురుషుడనియే తోచుచున్నయది.

వు॥ నారదుడో పంకజగర్భుడో శశియో । గుహ్యాధీశుడో సూర్యుడో
హారియో జంభవి భేదియో యిటు । మనుష్యాకారముఞ్ దాల్చిమా
సిరిగాంచఞ్ జనుదెంచి యిప్పుడు । పరీక్షించంగ సూర్చుండెనో
అరయఞ్ జాలకయుంటి నామదిని । కార్యంబేమియుఞ్ దోచదే.

నామ॥ అమ్మా అగొని తెచ్చినది చారా అది అటునుంచి మొదట అన్నము చారు శాకము గొని తెమ్ము క్షుద్బాధ మిక్కుటముగా నున్నది. అపుకొనజాలకున్నవాడ.

కమ॥ (తనలో) యిప్పట్టున నాకు పాండురంగడే శరణ్యము. దేవాదిదేవా ఆది మధ్యాంత రహిత నారాయణా పాండురంగా.

మాండ్ రాగము – అది.

కరుణామయభావా దేవా ॥కరు॥ నిరుపమచరితా సురరిపు విజితా సరసిజ భవవినుతా । దేవా ॥కరు॥ మునిజనావనా మనసిజజనకా వసుబోవవే శోభన సదనా వినుతాత్మజ గామి । స్వామి ॥కరు॥ కనకవసన ముల్లాల్ల కపినుతా । వనజాక్షా పావన చరణా వన జోప్పవతాతా । దేవా॥

వ॥ సకల భూతదయా సముద్రుండవగు నిను గొనియాడ నాతరమా దీనజ నావనుడ వగు నా యాపద వొలవగింప నీవే సమర్థుడవు. నీయడుగు దమ్ములకు నిరంతరము నమస్కరింపుచు నిను ధ్యాన మొనర్చు నను మన్నించవా నాయపరాధము క్షమించవా.

(తెరలో) పాండు॥ హనుమాన్ యింకను భోజన మొనర్చుచునే యుంటివా.

హను॥ త్రేపుదీసి భుజించితిని కాని హస్త ప్రక్షాళనాదికర్మ మాగినది (అని చేయి కడుగుకొని)

(భాగ్యశెట్టితో పాండురంగడు ప్రవేశించి)

పాండు॥ (భాగ్యశెట్టితో) శేటుగారు చాలా రుచివంతమగు భోజనమిడి మమ్మా నంద పరవశులగా జేసితిరి.

భాగ్య॥ తమదయ (హనుమాన్ గాంచి) హనుమాన్ యిష్టముగా భుజించితివా.

హను॥ అయిష్టముగా భుజించువారుందురా (తనలో) పాండురంగడు ముచ్చట చాలించుట వలన నీయదృష్టము మంచిదైనది లేకున్న నీగతియేమగునో నేడు.

పాండు॥ హనుమాన్ గుర్రమును సిద్ధపరుపుము జనవలయును.

హను॥ చిత్తము. (నిష్క్రమించును)

పాండు॥ శేటుగారు యిక నేను జనుచుంటిని లగ్న సంభారములన్నియు సిద్ధ పరుపుము గ్రామాలంకారము గావించి అపర దేవేంద్రనగరము గావించుడు. మాదామా జీగారికి తగు సత్కార మొనర్పుడు. వారేదియు లడుగువారలు గారు. నేను లగ్నము నకు వచ్చెదనోలేదో అన్నియు సక్రమముగ జరిపించిపిల్లను పిల్లవానిని మరల పండరికి సాగనంపు భారము దేవరి వారికడనుండి మీకేమైన వచ్చునది వుండిననే మరల వచ్చెదను అప్పుడు అన్నియు మాట్లాడెదను.

భాగ్య॥ మీరుతప్పక లగ్నమునకు రావలయును.

పాండు॥ తీరిక యుండిన వచ్చియేతీరుదును తీరిక లేనిపక్షమున క్షమింపుడు.

భాగ్య॥ మా అదృష్టము.

పాండు॥ యిక పోయివచ్చెదము.

భాగ్య॥ చిత్తము.

(అందరు నిష్క్రమింతురు)

---

ద్వితీయరంగము

దామాజిగారు కూర్చొని భగవద్ధ్యాన మొనర్చుచుండును

మాల్కౌస్‌రాగము ఆదితాళము.

శోభనగుణసదనా । మాధవ ॥శో॥ ప్రాభవ కలిత విస్ఫారయధన ॥శోభ॥ రావణమదగిరి ప్రాతకులిశముని ॥ భావమనోహర వనజ విభాకర ॥శో॥ నీలాంబుద సన్నిభశరీరహా । ఖ్యాలవాల ముల్కల్ల కపివినుత ॥శోభ॥

జగదీశా పాండురంగా త్రిగుణాతీతుండవగు నీవటన మేమనువాడ.

ఉ॥ ఎందులకీజగంబు। జనియింపగ జేసితో రక్షణంబునీ
వెందుకు జేయుచుంటివో। మరెందులకుకా విలయంబు సల్పెదో
నిందుననీకు లాభమది। నేమియు గల్గునో దేవదేవనా
కుందలపోయ భావమునకుకా। కడుచిత్రముగా స్ఫురించెడుకా.

సమస్త జంతుసంతానము కల్పించి దానికి లీలావిభూతియను నామకరణం బొనరించి వాటిని నీయిచ్ఛానుసారముగా నాడించు సూత్రధారుడవై భాసిల్లుచుందువు వాటిలో మానవుల నుత్తములుగా జేసి నిన్ను జెందుటకు వారికనేక సులభమార్గముల కల్పించితివి. అవి వారు కనుగొనజాలక పశు ప్రాయులై శిశ్నోదర దాసులై అజ్ఞానాంధకార నిమగ్నులై పరిపరి వర్తనులై మూఢ హృదయులై యిహలోక సౌఖ్యమే స్థిరమని తలంచిఆశ్రమ ధర్మముల మరచి వర్థిల్లు చుండిరి కటకటా యెంతటి దుష్కాల మావహిల్లినది.

సీ॥ శ్రీకారమన పర్వతాకారమైయొప్పు। వెంగలు లెల్ల కవీంద్రులైరి
వజ్రకుంతలు మహోపన్యాస పరులైరి। క్రూరచిత్తులు వంశ గురువులైరి
శరవానజనులు శాస్త్రార్థ కోవిదులైరి। వేశ్యాత్మజులు ధర్మవేత్తలైరి
అవినీతిపరులు కృత్యర్థ బోధకులైరి। త్రాగుబోతులుమహా యోగులైరి
గీ॥ ప్రాతలంజలు గనవీర మాతలైరి। పసులగాపరి వారలే రసికులైరి
కలియుగాంగన యింకనీ గర్భమునను। ఎట్టివారి గనదీక్ష పట్టినావో॥

ఎందరెందరో మహాత్యాగశీలురు సంస్కరణకై పాటుబడుచున్న మానవులయందు గాఢముగా నెలకొనియున్న అజ్ఞాన సాంద్రాంధకార తొలంగకున్నది.

(పాండురంగశేటు ప్రవేశించి)

పాండు॥ కాఫిరాగము త్రితాల్.

క్షేమమానీకు దామాజీ। నీసతీసుతయయముగా ॥క్షేమ॥ శ్రీమనోధవుని భజనము భక్తితో జేయుచుందువే నిర్విఘ్నముగను ధామమందు నేమమునను ॥క్షేమ॥ సతతము భక్తులు నీదు నార్తులను శ్రద్ధతోడ గాలకించువారలె। నుతవిచార పరమధీర। మహితపాద ~~~~ంభీర॥

దా॥ అయ్యా దయచేయుడు యీకృష్ణాజిన మలంకరించుడు.

పాండు॥ (కూర్చొని) ఏమిచేయుచుంటిరి.

దామా॥ భగవదాలోచనము దప్ప నాకు వేరే యాలోచన మేమున్నది. (ఇంచుక యూరకొని) అయ్యా తమదేగ్రామము.

పాండు॥ మాదిదేపురము నాపేరు పాండురంగశేటుగారని పిలతురు మీరెప్పుడు భగవదాలోచన నిమగ్నులయ్యే యుందురు గాని యుక్తవయస్సంపన్నుడగు మీకుమారుడగు నామదేవు కల్యాణమును గురించి ఆలోచించుటలేదా.

దామా॥ అయ్యా మీమాటలకు నవ్వువచ్చుచున్నది.

పాండు॥ ఎందులకు.

దామా॥ నామదేవునకు అపుడే వివాహ ప్రాయము వచ్చినదా సామాన్యముగా ముక్కుపచ్చలారని పసివాడు. అట్టివాని వివాహము గురించి నేనేమాలోచింపవలయును. సర్వరక్షకుడగు శ్రీపాండురంగడు లేడా.

పాండు॥ తండ్రులకు కుమారుల వివాహము చేసిన భారము తగ్గును ఎన్నడైన మీరు చేయవలసినవారలే. అందున పసితనమున వివాహము గావించిన నే బాగుగా యుండును.

దామా॥ ప్రస్తుతము ప్రపంచమునకు పట్టిన పిచ్చియేయిది.

సీ॥ విద్యావిధాన సద్విషయంబుగనకున్న । వైవాహమొనరింప వలెనటంచు
కనులనువిప్పి లోకమును చూడకయున్న । పరిణయ మొనరించ బాగటంచు
ధనసంగ్రహణ సాధనము నేర్వనినాడె । పెండ్లిసేయుటె మహాప్రీతియనుచు
ఉగ్గుపాల్ద్రాగుచు నుండుకాలమునాడె । పాణిపీడనసేయ పాటియగుచు
గీ॥ పామరులుబల్కువాక్యముల్ పరమధర్మ । మనుచునమ్మెడివారలుయనఘమతులె
అరయ పసికూనలనుబట్టి పరిణయంబు । సల్పుటేదోషమనెద నిస్సంశయముగ.

అతిబాల్య వివాహమునకు జనులు పాల్పడుటచే లోకమింత హీనస్థితిలో నున్నయది మానామదేవు అపుడే లోక కల్యాణ వ్రతము సాగించెనా. గురుజన శుశ్రూషణ యొనరించి ప్రసిద్ధ యశంబు గాంచెనా అపుడే తొందరెందులకు.

పాండు॥ యీగాథ యంతయు నేల పార్లించెదరు ప్రస్తుతము మీకుమారునకు పిల్ల నిచ్చెదరని వచ్చిన ఏమనియెదరు.

దామా॥ పాండురంగని యనుగ్రహము.

పాండు॥ భాగ్య నగర నివాసియగు భాగ్యశెట్టి కుమారిక రాధాబాయి అను కన్యను మీనామదేవునకు నిశ్చయించి వచ్చితిని. లగ్నము నేటికి రెండుదినములు గలవు. శీఘ్రముగా పయనమై పొండు.

దామా॥ (నవ్వి) అయ్యా యీవెళాకోళపు మాటలెందుకు కుక్క దరిద్రులమగు మాయింటికి భాగ్యశెట్టి తనకుమారిక నిచ్చుట అసంభవము.

పాండు॥ నేనన్నృత మాడువాడను కాను. యిదుగో చూడుడు లగ్నపత్రిక చేతికిచ్చి సర్వము నేనే నెరవేర్చెదను మీరు ధావంత మనుమాట మాని సత్వరము మీరు జనుడు.

దామా॥ (చూచి) యిదియేమి చిత్రము యంతయు పాండురంగని కృపాకటాక్షవీక్షణమె.

పాండు॥ నాకు పనులు చాలా గలవు సుముహూర్తము వరకు నట కరుదెంచెద మీరు త్వరగా పయనము గండు.

(నిష్క్రమించును)

దామా॥ కుమారా ప్రేయసీ.

నామ-సుగుణా॥ (ప్రవేశము) మహాత్మా ఏమిశెలవు.

దామా॥ భాగ్యనగర కాపురస్తుడగు భాగ్యశెట్టి తన కూతురగు రాధాబాయిని మన నామదేవున కొసంగుటకు లగ్నము నిర్ణయించి శుభపత్రిక నంపినడు. కావున కుమారా త్వరగ మన వృషభము పై గంతయును మనమువ్వురి తాంబూలను చిరుతలను భద్రముగా నుంచుము ప్రేయసే త్రోవకేమైన బత్తెము గట్టుము నేను త్వరగా పాండురంగ దేవాలయమున కరిగి వచ్చెదను.

గుణా-నామ॥ చిత్తము.

(అందరు నిష్క్రమింతురు)

---

## తృతీయ రంగము

(దామాశెట్టి గుణాబాయి నామదేవు ఎద్దుతో ప్రవేశము)

దివాణ్

దామా॥ మధ్యమావతి రాగము - ఆది.

శ్రీరంగని కీర్తనము । సారము భువిసంసార తరణమా ॥శ్రీరం॥ సూరిజనుల కానంద దాయకము దూరకలుష సందోహము శుభమా ॥శ్రీ॥

నామ॥ మంగళకరమా సుఖము । మహితము మునిజనమానిత మంత్రము॥మం॥ శృంగారము సారంగ వరదుడౌ రంగని గొలచిన రావుయాపదలు ॥శ్రీరం॥

గుణా॥ ఘనతరమై భాసిల్లుణ్ । అనితర గంభీరము పావనము ॥అని॥ ఘనముల్కాల్ల నికాయుడు దీనా । వసుడగు కపివరు భవ్యమంత్రిమిదె ॥శ్రీరం॥

వ॥ నాధా మనము ప్రయాణమై నొకదినము గడచెను. యీవృషభము అడుగునకు అరువది సారులు పవళించుచుండెను. వివాహము నేడు సాయంత్రముననే కదా. యిక్కడకు భాగ్యనగర మెన్నియో యామడ గలదు. యిట్లు నడచిన యెట్లుచేరగలము.

దామా॥ జగద్రక్షకుడగు పాండురంగని యనుగ్రహ ముండిన అంతయు నెరవేరును వానికృప లేకున్న మన మెంత వారము. నీకెన్ని సారులు బోధించిన యీవెర్రి నడువడి. మానవు.

దివాక॥ మహాత్మా ఏబయల్కు మార్కా హుటాహుటం (అని కొట్టబోవును)

దామా॥ (అడ్డమువచ్చి) పిచ్చివాడా ఆగుము కొట్టకుము హింస చేకూరును అదియే లేచును అంతవరకు హరిభజనము గావింతము అట గూర్చుండుడు కుమారా ఆ తాంబూర చిరుత లిటు డెమ్ము.

నామ॥ చిత్తము (తాంబూర చిరుతల యొసంగును)

దామా॥ (కృతిజేసి)

మ॥ వర కైవల్య సుఖంబు పాపహరమా। భాసిల్లు సౌఖ్యంబుదు
ర్భరదుఃఖౌఘ నివారణంబు శుభసం। పత్కారణంబంచితా
కరభాగ్యోదయ మాత్మశాంతియు మహా। హ్లాదంబు విజ్ఞానముం
పరమోదార్య మొసంగుమీభజన। దేవా పాండురంగప్రభో.

కానడ రాగము - ఆది.

కరుణించుటా కిదెయదను శ్రీరంగా ॥కరు॥ పరిపరివిధముల ప్రార్థించిననను వరయకుంటివే నాకర్మమేమది ॥కరు॥ నీవేదిక్కని నిరతము నమ్మితి నీరజాసనాది మానివందిత ॥క॥ పాతకినైనే పాలబడితి నీవేతీరున నను కడతేర్చెదవో ॥కరు॥ కనకచేల మూల్కల్లపత్తనా। వనచరవందిత పాదవనరుహా ॥కరు॥

(వొక ప్రక్కన పాండురంగస్వామి ప్రవేశించి తనలో)

వ॥ పాపము యీవృద్ధము మాటిమాటికి పరుండుచుండెను. దానికడ నిలుచ సత్వలేకుండ యుండెను. నేటిరాత్రమే వివాహ ముహూర్తము. భాగ్యపుర మింకెన్నియో యామడల దూరము గలదు. వీరలిట్లు నడచిన యెట్లు చేరగలరు. వీరినేయుపాయమున భాగ్య నగరమున జేర్పవలయును. యీవివాహము నగుబాటగునాయేమి (విచారించి) ఏమీ యీముహూర్తమునకు నామదేవు కల్యాణము గాకుండునా.

కామవర్ధని రాగము - ఆదితాళము.

తలచిన కార్యము జరుగకుండినను నిలచునె యీజగములు క్షణమైననే ॥తల॥ జలజగర్భ పశుపతినాయాజ్ఞను తలధరించి సంచరించువారలు ॥తల॥ పరమపావనుడు నామదేవునకు పాణిపీడనము గావించియుదు। మ్కరుడు లోభుడగు భాగ్యశెట్టినిక వరభక్తునిగా నొన రించెదనే ॥తలచి॥

యిపుడే గరుడుని నాహ్వానించెద. తార్క్ష్య యిటురమ్ము.

(గరుత్మంతుడు ప్రవేశించి) కీర్తన పైచరణము.

వనజానన నీపదములకును వందనమొనర్తు పావనచరితా ॥వ॥ కనకచేల భాస్కరశశినయనా వినుతచరణ శ్రీ హరిజగదీశా ॥ దనుజవారణ భక్తార్తిక విజితశో। భవన మూల్కల్ల పురీశ వినుతకాం। చనగిరి సన్నిభ శౌర్యదురంధర మనసిజజనక పరేశముకుందా ॥వన॥

మహాత్మా నన్నురావించిన గతంబేమో శెలవిండు.

పాండు॥ నీదివ్యమగు శక్తిని దామాజిగారి వృషభముపైనుంచి వారలక్షణములో భాగ్యనగరము జేరునటుల యొనర్పుము.

గరు॥ చిత్తము. (యిరువురు నిష్క్రమింతురు)

వృషభము లేచును.

నామ॥ నాయనా వృషభము దానంతట నదియే లేచినది భజన చాలించి ప్రయాణము సాగించుడు.

దామా॥ మంచిది నడువుడు.

నామ॥ (గుణాబాయితో) అమ్మా నాకు నడచుటకు చాలా బడలికగా నున్నది నీఎద్దుపై నధిరోహింతును.

గుణా॥ తండ్రీ మెలమెల్లగా నడువుము నీఎద్దుపైన నెక్కిన మరల కూలబడిన ప్రయాణము భంగమగును. నేడు సాయంత్రమె వివాహము గలదు భాగ్యనగర మింకెంతో దూరముగలదు.

నామ॥ తల్లీ నన్నొకని మోయకుండునా ఏదీ ఎక్కిచూచెదగాక (ఎద్దుపైననెక్కి ఎద్దు వురుకుచుండును) నాయనా అమ్మా యీవృషభమునకు బహుపాటవము గల్గి ఎట్లు పరుగిడుచున్నదో చూడుడు మీరిరువురు కూర్చుండుడు అదియే నడచును.

గుణా॥ ఎందులకు నాయనా నడువనిమ్ము మేము నడచియే వచ్చెదము.

నామ॥ వలదమ్మా మీరు నామాటవిని యీవృషభముపై నధిరోహింపుడు నేను నడిపించెదను.

దామా॥ ప్రేయసీ వాని యిష్టమెట్లో నట్లె కావింతము.

గుణా॥ చిత్తము. (ఎద్దుపై నెక్కెదరు వృషభము వురుకును)

దివాన్॥ (తెల్లబోయి చూచుచు) హాంకు కోన్‌వృాఛ్ తే యే తీన్ బయలపర్ బైఠ్‌కర్ చెలేగయా. హంకసాజానా భగవాన్ కాకృపా ఐసీహై ఆయిస్తా ఆయిస్తా చెల్తాహుం (నిష్క్రమించును)

భాగ్యనగర సమీప భూమి వృషభము చేరును

దామాజి గుణాబాయి నామదేవు దిగుదురు.

దామా॥ దేవీ యీవృషభము మిక్కిలి చిక్కియున్నను దాని పరుగిడుడము అగాధమై యున్నది. దీని సత్వమున్నదని యెన్నడెరుంగను (యిటునటు చూచి) యెట్ట యెదుట అనేక సౌధరాజ పంక్తులచే భాసిల్లుచున్నదే భాగ్యనగరమై యుండవచ్చును.

నామ॥ అమ్మా నాకు అనేక ఆకలి యగుచున్నది యది శమించుటెట్లు.

గుణా॥ బిడ్డా మనముతో రాగ తీసుకొని వచ్చిన రొట్టెలు యిక రెండుగలవు గాని అందులకు అనుపాన మేమియూ లేదు. (అటునిటుగాంచి) యిదుగో యిచటనే మిర్యపు తోటయున్నది అందరికి రెండు మిర్పపుకాయల తెచ్చుకొని వాటిని భక్షించుము.

నామ॥ మంచిది (నిష్క్రమించి మరల ప్రవేశించి)

అమ్మా యీతోట మామామయగు భాగ్యశెట్టిగారిదట నే నందరగి మిర్యపు కాయలు తెంపుకొనగ తోటకాపరి నన్నదలించ వానితో ఓరీ నేనీ పురమునను౦డు భాగ్యశెట్టి అల్లుడను. అని వచింప వాడు మనము వచ్చుసంగతి భాగ్యశెట్టిగారి కెరింగించుటకై పరిగత్తి యున్నవాడు. వారింతలోనే రాగలరు నాతడు వచ్చువరకు నారొట్టె ముక్కలను భక్షించెద యిటుదెమ్ము.

(రొట్టెముక్కలనుగొని భక్షించుచుండును)

(భాగ్యశెట్టి ప్రవేశించి తనలో)

నాయల్లుడగు నామదేవుగారు దామాజిగారు విచ్చేసి తోటకడ యున్నవాడని తోటకాపరివాడు వచించె వారిం దెందును గానరారు. (ఇటునటుజూచి) అక్కడ నెవ్వరో భిక్షుకులు గలరు వారినడిగి తెలుసుకొనవలయును. (దామాజిగారిని సమీపించి) ఓరీ భిక్షుకుడా పండరీపుర వాస్తవ్యుడగు దామాజిగారు సకుటుంబముగా దయచేసి యిట విడిది చేసిరట వారెందున్నవారలు.

దామా॥ (భజనచాలించి) వీడేదామాజి వీడే నాసుతుడగు నామదేవు యీమెయె నాగృహిణియగు గుణాబాయి.

భాగ్య॥ (తనలో) వీరలీ వికారవేసములు ధరించుటకు కారణమేమి. ఆతెల్లని పట్టెనామములు, ఆ తాంబూరలు, ఆ జపమాలికలు, ఆ కావిగుడ్డలు, వీరిట్లుండుటకు హేతువేమి. వీరలు మహా ధనికులని పాండురంగశేటు వచించెనే, వివాహమునకు వచ్చి యీపాదువేసములతో జనులెంతురా వెంబడి వివాహ సంభారము లేమియులేవు యిది యేమి వీరియాకృతుల ధరించ బోడిదాసరుల చందమున్నవారలు యింతవరకు నాకుతగిన సంబంధము దొరికెగదాయని గర్వించుచుంటిని నాగర్వమెల్ల మంటగలసినది వీరలు కుక్కదరిద్రుల వలెన్నే గాన్పించుచున్నవారు (విచారించి) అయిన తొందర పడవలదు. (ప్రకాశముగా) మీరెందు జనుచుంటిరి.

దామా॥ భాగ్యశెట్టితనకుమారికయగు రాధాబాయిని నాకుమారునకీయగలనని శుభపత్రిక యంపుటచే యరుదెంచితిని.

భాగ్య॥ మీకడ సదా యెడబాటులేక నివసించు పాండురంగశేటు వచ్చియున్నవాడా.

దామా॥ కుక్కదరిద్రులమగు మేమేడ మహా ధనసంపదచే విరాజిల్లు పాండురంగశేటేడ నాతడేల సదా మాకడ నివసించును.

భాగ్య॥ (తనలో) వీరలతిదరిద్రులని యిపుడు పూర్తిగా తెలసినది. యిట్టి నిరుపేదలకు శిరీష కుసుమ నిభకోమలాంగియగు మారాధాబాయి నొసంగుటమా మాకును వీరికి హస్తిమశకాంతరము యెండకన్నెరుంగని మారాధ యేడ బడగుదాసరివలె వర్తిల్లు వీడేడ నక్కయెక్కడ నాకలోకమెక్కడ అనునట్లు వీనికి మాబాలిక నొసంగు టతిసంభవము. వీరితోనే సంబంధము చేసిన లోకమున నగుబాటుయేకాని కీర్తికరముకాదు. వీరల మావీటివారలేకాని మాబాంధవులే వీక్షించిన నన్ను హాస్య మొనర్తురు వీరినిక్కడ నుండియే నావలకు సాగనంపించెద (యించుక యూరకొని) పాండురంగశేటు ఎంతవంచ

కుడు. మొదట నాకడ కరుదెంచి పేరులేని పెద్దమ్మయగు యీధామాజి గొప్ప ధనికుడని తట్టువాని చందము పొగడి వివాహ ముహూర్తము నిశ్చయించి నిష్కారణముగా సాధన మెంతయో వ్యయము చేయించినదు వాడిప్పుడు నాకనుల కగుపడిన బాగుండును. కసి దీర్చుకొందును.

దామా॥ అయ్యా మమ్ముల వీక్షించి అతివిచార మొనర్చుచుంటి రెందులకు.

భాగ్య॥ ఛీ దౌర్భాగ్య దామోదరా నేనే భాగ్యశెట్టిని నేను మీతో సంబంధ మందుట కల్ల మీరు తచ్చుమార్గము బట్టుడు.

నామ॥ మొదట అన్నియును విచారించక శుభపత్రిక ఏలయంపితిరి.

భాగ్య॥ నేనంపలేదు అదియంతయు మీపాండురంగశెట్టు పన్నిన పన్నాగము.

గుణా॥ అన్నా యిట్టిశుభకార్య విషయమున అనృతము లాడువారుందురా.

దామా॥ పాండురంగశెట్టు మాకిశుభపత్రము నొసంగి పొమ్మని నిర్బంధ మొనర్చ జనుదెంచితిమి. క్షమించి యీశుభకార్యము నెరవేర్చి పంపుడు.

భాగ్య॥ ఛీ అప్రగల్బా.

మోహనరాగం - ఆది.

జనుడునాతో వాగ్వాదము నొనరించుటమాని మీదువినయములు పొగిరాత్రు॥ ఛీఛీఛీఛీ ॥జ॥ ధనకరలుడనైనవాడు తనయుసు మీకిడుటతొల్లు మనమునీయ కొనుకొనట్టి కుమతేమీరు తెలియుమదిని ॥జను॥ యెంతప్రార్థనము చేసిన కుంతలైన దాక్షిణ్యము స్వాంతమందు గలుగ మీచింతబాయు టేమిలచిది ॥జను॥ ధారుణి ముల్కుల్లపతన తనయుడు చెప్పిన విందునె । భీతికోప ముదయించెను తొందునాతో వాదములు ॥జను॥

క॥ మీతెక్కడనుండిన మీకు తగిన శాస్తి రెయునెవ్వడ పొందు.

(నిష్క్రమించును)

దామా॥ హా పాండురంగ యీగందరగోళ మేలకల్పించితివి యెప్పుడైన మాకొలు నకు వివాహము కావలయునని స్వప్నమందైన దలంచితిమా యిదియంతయు నీలీల లాల సమరెప్ప మదెంతయు గాదు.

చ॥ హరచతురాననాది త్రిదశాదులు తావక మాయమెంతయుం
నెరుగక క్రిందుమీదరయ భ్రమించుచు నుండదు రట్టివారికే
దురితుడ మూర్ఖచిత్తుడ సదోత్కట కుత్సిత వర్తనుండనే
ఎరయగ శక్యమౌనె దయానిధి పండరి వాస మాధవా॥

జగత్ప్రభో మమ్మిట్లవమానితాత్ములగా నొనర్చిన లాభమేమని దలంచితివి మేము మీకేమి యపరాధ మొనర్చితిమి సదా నీభజనమే ఆనందదాయక మని హృదయమున నమ్మితిమి. నీపూజయే సకల సౌభాగ్య ప్రదమని తలంచితిమి. అట్టివారిని నిట్లొనర్చుట న్యాయమా (విచారించి) యిదియంతయు మాపూర్వకృత కర్మవిశేషము.

మాయామాళవగౌళ - ఆది.

మాధవా నినుమదివిస్మృతి బాధమాన్పి బ్రోవుమయ్యా శ్రీహరి ॥మాధ॥ భూధరేంద్ర సమ ధీర పన్నగ విభూషణతల గర్భతంత్య పదయుగ ॥మా॥ చాలా । వనట నొందితిని గుణ

శీలా । మునిపాలభక్త జనలోల । యికజాలమేల జేసెదావు వరకరుణాలవాల ముల్కల్ల కపివినుత ॥మా॥

సీ॥ సకలదోషాచర సంఘంబుదున్మాడి । రక్షించితివి నిర్జరాధిపతిని
బలవత్కపీంద్రులు బిలకించకడుకృపా । పరుడవై సుదుతను సరసినావు
జలజాసనహారా దులకండరానట్టి । నిరవు జటాయువు కిచ్చినావు
కౌశికు యాగభంగము సేయు మారీచు । దనుజాళి యమపురికనిపినావు

గీ॥ దుష్టనిర్మూలనంబు విశిష్ట సమితి । పోషణము ధర్మసంత్రాణ మునుత్వదీయ
ధర్మమౌ పాండురంగని దాసజనుని । గావుదగు భక్తవరద పంకరుహనేత్ర॥

(పాండురంగస్వామి కోపమున ప్రవేశించి)

మోహనరాగము - ఆది.

తెలియదెనామహిమలల్ । ఖలకర్ముడైన భాగ్యశెట్టి మదిలో ॥తె॥ తెలియజేతు నాదు దివ్య మహిమల తేటతెల్లముగ దుష్కృతునకు నే ॥తెలి॥ నాశ్రిత జనులను పేదలగా । దలచి నాదు ధిక్కరణంగ జేసెద ॥నా॥ కలుషమతుడు దుష్ట్యాతిపతుడు భక్తులనిందించిన లోభ వర్తనుడౌ॥ నైన తేయా.

గరు॥ (ప్రవేశించి) యేమి సెలవు.

పాండు॥ దురాచార పరాయణుడగు భాగ్యశెట్టి నాభక్త వతంసులు నిరుపేదలని తనకూతుడు నిచ్చుటకు నొప్పక వారల నిందించి మరల పంఢరికనుప బూనినాడు నాభక్తులు నిరుపేద లెట్లగుదురో భాగ్యశెట్టికి కనుపగేచి భక్తునిగా యొనర్చవలయును. కావున నీవు త్వరగా నరగి రాజరుషి సహితముగా చతుర్ముఖుని ప్రమథ గణాళితో శంకరుని సురాసుర గరుడ గంధర్వ యక్షపన్నగాదుల యీక్షణమున దోడ్కొని భాగ్య నగర సమీప భూమికి జనుదేరవలయును నేనిదే నటకు జనుచుంటిని.

గరు॥ చిత్తము.

పాండు॥ పావనీ.

హనుమంతుడు ప్రవేశించి దేవా యేమియానతి.

పాండు॥ మనము మరల భాగ్యనగరము జని నామదేవు కల్యాణ మొనర్చవలయును రమ్ము అని నడచుచు భాగ్యనగర సమీపభూమికడ కరుగుదురు.

హను॥ (చూచి) స్వామి హరబ్రహ్మాదిసురలందరు నామదేవుకల్యాణమునువీక్షించ నేతెంచిరి. నేడు కడుసుదినము.

పాండు॥ హనుమంతా సకల దేవతానీకము జనుదెంచిరి నామదేవు కల్యాణము కడు మహోత్సవముగా జరుగుగాత నీవు భాగ్యశెట్టికడ కరిగి నేను వచ్చితినని వచించి దోడ్కొనిరమ్ము.

హను॥ చిత్తము (నిష్క్రమించును)

(భాగ్యశెట్టి ప్రవేశించి)

(తనలో) యేమిచిత్రము యెటుజూచిన భూమి యీనిన చందము వింతవింతయగు వారలు కాన్పించుచుంటిరి. అపూర్వ మంగళ వాయిద్యములు మ్రోగుచుండెను. యెదిశ

గాంచిన రంభాదులతో సమానులగు వార వధూమణులు నాట్య మొనర్చుచుండిరి. నింతకు పూర్వము నిక్కడ నిర్మానవ సంచారముగా నుండెను యింతలో యిందరెక్కడినుండి యరుదెంచిరి వీరెక్కడివారై యుండవచ్చును. సాధనమంతయు వీరికొకపూటకు భోజనమునకు సరిపడునో లేదో తొలుత దామాజిగారు నిరుపేదవాడు బంధురాహిత్యుడని దలంచితిని గాని యింత బంధుజాలము గలదని దలంచనైతిని. నిక్కముగా విచారించిన దామాజిగారి విభవమునకు నేసరి రాజాలను. (విచారించి) ప్రస్తుతము పాండురంగ శేటు గారిని దర్శించి సంభాషించి ముందు జరుగుకార్య మాలోచించెద (నడచును)

పాండు॥ భాగ్యశెట్టి మేమరుదెంచి చాలా తడవయ్యెను. మాకొనర్చు సపర్యల యొనర్చక యుంటివి. మావారెల్లరు యిదియేమి సంబంధమని విసుగుకొనుచుండిరి. ప్రస్తుతము వీరికి తగిన వసతు లేర్పరపుము.

భాగ్య॥ అన్నియును మీరు నావెరగుననుండి నొనర్పవలయునని ప్రార్థన. మొదట దామాజిగారిని చూడవలయును వారెక్కడగలరో చూపుడు.

పాండు॥ రండు (యిరువురు నడతురు దామాజిగారిని చేరుదురు)

భాగ్య॥ (అద్భుతపడి) (తనలో) వీరలప్పటివారలే శుష్క దరిద్రులగు వీరికీవిభవమెక్కడినుండికచేకూరినది (విచారించి) మహాత్మా దామాజి క్షమింపుడు. తొలుత మీవిభవము గానక దూలనాడితిని నాడు పాండురంగశేటుగారు వచించిన దానికన్న తావకీన వైభవము వేయిరెట్లు హెచ్చుగానున్నది యింత బంధుసంపద గలవారెందుగలరు. యీ మంగళ వాయిద్యములు శ్రోత్రపర్వ మొనర్చుచున్నవి వారవధూటీ నాట్యము నేత్రపర్వ మొనర్చుచున్నది మేమీ యీజనము చాలాసంతసించితిని నాయపరాధము మన్నించి మీపాద రాజీవములకు వందన సహస్రము లాచరించువాడ.

దామా॥ (కనులవిప్పి అటుఇటుగాంచి) అయ్యా వెర్రిరెత్తినదా ఏమి యెటు గాంచిన యేమియు లేదు. అనేక జనము వింతయగు మంగళ వాద్యములు నెరజాణలగు వారవధూటులని వచించెదరు మమ్మెలేల యెత్తి పొడచెదరు.

భాగ్య॥ అయ్యా అసత్యముగాదు. సరిగాచూడుడు అనేక వింత గొల్పువారలు దేవతా సన్నిభులు. కోట్లకొలదిగా నున్నవారు అదే పాండురంగశేటు. మానుమాక్ నాట్యమొనర్చు వారకాంతలు. వేదఘోష యొనర్చు భూసురులు భళీ యేమివైభవము.

దామా॥ (తనలో విచారించి) నాకేమియు గాన్పించుటలేదు. యిదియేమి చిత్రము యీపాండురంగశేటు యెవరైయుండవచ్చును యీతనికి మాయందింత పట్టుదల యెందులకు విచారించ నాపాండురంగశేటు నాదేవదేవుడయ్యే యుండవచ్చును. స్వామి భక్తపరాధీనుడవగు నీవు భాగ్యశెట్టికి కాన్పించుటమేమి నాపాడుకనులకు గాన్పించకుండుట యేమి. నాపాపఫలమా.

బీన్‌ఫలాస్‌రాగము — ఆది.

దయజూడవేల శ్రీరంగా ॥దయ॥ భయహరణా నీపాత్రిపుగోరితిని నయగుణజ్ఞుడ సనాతపురుషా ॥జూడ॥ దీనోద్ధర సుస్థిరసంకల్పా । మాననీయ కానరావదేర ॥జూడ॥ కమలనేత్ర మునుల్కల్లకపినుతా । విమలచరిత వేదాంగభరిత ॥దయ॥

పాండు॥ (సాష్టాంగ నమస్కరించి) దామాజీ నీవు పరమభక్త శిఖామణివి నేను భక్తజన విధేయుడను. యిదియంతయు గావించినది నేను నీకు ప్రవాహమున నాడు కాలునొసంగినది నేను. ననునమ్మి వారికోరికలు సఫలత్వ మొందును. (భాగ్యశెట్టితో) భాగ్యశెట్టి నిరంతరము ధనసంగ్రహణమునందే జీవితము వ్యయపరచి లోభవర్తనుడవై భక్తితత్వ మెరుంగని నీకును దామాజిగారిని గురించి సందర్శన మొసంగితిని. నీవు ధన్యాత్ముడవు. వీరల్లరు దేవతలు సాధకులెవ్వనికి దరిద్రులుకారు సకల సౌభాగ్య సమోపేతులు వీరందరు నామదేవు కల్యాణమునకై అత్యుత్సాహ సమన్వితులై యరుదెంచిరి. నీసంశయములు మాని నామదేవునకు నీకన్యను కల్యాణము గావించుము. వారన్యోన్య ప్రేమగల వారలై లోకకల్యాణము గావించగలరు.

భాగ్య॥ బిలహరిరాగము – జంపెతాళము.

పరమేశ ననుగావ భారమా దయరాద ॥పర॥ దురితుడంచని మదిని దలచబోకయ్యా ॥ప॥ నీనామమెంచగను నేనారదుడగాను పూనికతోనినుమోయ వయిననతేయుడగాను । ధ్యానమొనరించ మాతంగరాజునుగాను । దీనపోషణ రుక్మిణీనాథ శ్రీరంగ ॥పర॥

మ॥ జగముల్ నాటకట రంగముల్ సలిపి విస్తారంబుగా మాయనాటికసీనర్తనరించి కామము నెలక్ట్రిక్ జేసి శీతోష్ణముల్
సొగసౌ జంత్రయుగంబు జేసినటులల్ చోద్యంబుగా జీవులం
దగతిక్ మార్చి నటింపజేసెదవు రంగా భక్తచింతామణీ॥

స్వప్నమునందైన తావకీన దివ్యగుణ కీర్తన మెరుంగని పరమ పాపాత్ముడ. నాయపరాధముల క్షమించుము (విచారించి తనలో) ఎంత ధనవంతుడైన దశదిగంత కీర్తి విరాజితుండైన సకల మహీమండలమేలు సార్వభౌముడైనను పరమ భక్తునితో సరిరాజాలడు. భక్తజనులకు అసాధ్యమ కార్య మెందైన గలదా దైవ భక్తునకు సాయమొనర్పని వారుందురా భక్తిని మించిన పదార్థం వేరొండుగలదా.

పాండు॥ ఏమిరో విచారించుచుంటివి.

దామా॥ భక్తి సంపదకు ధన సంపదకుగల తారతమ్య మెరింగి నింక విచారించ నేమున్నది (అయ్యా తామందరు మద్గృహంబున కరుదెంచి యీశుభకార్య మొనర్పగలరని ప్రార్థన.

పాండు॥ అట్లే గావింతము.

భాగ్య॥ నాధనమంత నెందులకు నేనింతవరకొసర్చిన కార్యము నిష్ఫలమైనది యిపుడే రాధాబాయిని నామదేవుగారి కొసంగి వివాహము గావించి నాధనమంతయు పాండురంగస్వామి కర్పించి దామాజిగారి పాదము లాశ్రయించి భక్తిమహాత్మ్యము దెలసుకొని పాండురంగని భజన మొనర్చుచు తత్తీర్థ ప్రసాదములచే సౌఖ్యముగా కాలము గడపెదగాక.

(అందరు నిష్క్రమింతురు)

చ తు ర్థ ర ం గ ము

(భాగ్యశెట్టి గృహము)

(పాండురంగడు నామదేవు హనుమాన్ గరుత్మంతుడు దామాజి
గుణాబాయి కమల రాధాబాయి భాగ్యశెట్టి ప్రవేశింతురు)

(నామదేవును రాధాబాయిని పీఠములపై కూర్చొనబెట్టి)

(అందరు అక్షంతలుగొని)

శ్లో॥ తదేవలగ్నం సుదినం తదేవా । తారాబలం చంద్రబలం తదేవా
విద్యాబలం దైవబలం తదేవ । పక్ష్మీపతే తేంఘ్రి యుగం స్మరామి॥
(అక్షంతలు రాధాబాయిపై నామదేవుపై నుంతురు)

దామా॥ వివాహము విధివిధానముగా జరిగినది యిక పాండురంగనికి ఆరతి యొసంగుదమా.

భాగ్య॥ చిత్తము.

పాండు॥ దేవతలారా మీమీనివాసముల కరుగుడు.

భాగ్య–నామ॥ (మ ం గ ళా ర తి.)

అసావేరి – ఆది.

ఆరతి గైకొనుమా । శ్రీపాండురంగ రుక్మిణీమనోహర ॥ఆ॥ వారిజాక్షవారిజాత నిభముఖ వారిజాత సంభవాది మునినుత । ఘోరకలుష దూరభక్తమానస సారసాళీ సంసారతరణ జయ ॥ఆర॥ మారజనక మేరుధీర శ్రిత మందారవారి వాహదేహా శుభకర । చారుభోగి రాజతల్పకౌస్తుభ హారవార్ధి గంభీర పరాత్పర ॥ఆర॥ సంగరారి గర్వశైల కులిశోత్తుంగ చరిత పద్మనాభహరిసా । రంగవరద వేంకటార్య పోషణ మంగళాంగ వేదాంగ భరిత జయ ఆర॥ కనకచేల ముల్కల్ల సమీరణ తనయవినుత పాదకీర్తిశోభిత । వినతాత్మజ గామిలోకపాలన ఘనచరిత్ర శోభనాంగ జయజయ ॥ఆర॥

జాయ్ మనాపుండరీక వరదహరి విఠేల.

ఓం శ్శాంతిశ్శాంతిశ్శాంతిః.

(అందరు నిష్క్రమింతురు)

గద్య.

ఇది శ్రీగీతాచార్య పాదపంకేరుహ సంసక్త మానస
శ్రీవటపురివంశ రాకాసుధాకర శ్రీవేంకటా
చార్య విరచిత నామదేవు కల్యాణ
నాటకము పంచమాంకము
స మా ప్త ము.

## ప్రకటన.

—:—

మావద్ద, నాటకములు, నవలలు, చరిత్రలు, యక్షగానములు, సంస్కృత గ్రంథములు, స్కూలు పిల్లల కుపయోగపడు స్టేషనరీ సామానులు, పుస్తకములు, ఉర్దు, ఇంగ్లీషు పుస్తకములు దొరుకును. మరియు మీ కేవిధమైన అచ్చుపనులు కావలయు నన్నను సకాలమునకు తయారుచేసి యివ్వగలము.

వలయువారు యీ క్రింది అడ్రసునకు వ్రాసి తెప్పించుకోగలరు.

చంద్ర నారాయణ శెట్టి

బుక్ సెల్లర్సు అండ్ ప్రింటర్సు,

జనరల్ బజారు, సికింద్రాబాదు.